కలియుగమందలి 'ఘనులే'
కలియుగ మిది - వట్టి 'పిదపకాల' మటంచున్
బలికెద రోక కొందఱు; త
త్ఫలితము నా 'స్తికపురాణ' వస్తువు నయ్యెన్.

— సత్యనారాయణ చౌదరి

# ప్రస్తావము

దైవచింత - ధార్మికప్రవృత్తి - బ్రాహ్మణభక్తి - రాజభక్తి - ఆస్తికబుద్ధి - వర్ణాశ్రమ పోషణము - షట్కర్మనిరతి, ఇత్యాదికములు — ఒకనాఁటి 'సనాతన భారత ధర్మము' లగుఁగాక! ఇప్పటి లోకము వాలకమే వేఱు. ఋతుధర్మములే వ్యత్యస్తము లయినట్టు 'సనాతనధర్మము' — అధునాతనులలో మఱొక యర్థము తెచ్చి పెట్టినది. దైవచింతలో—అనుపానముగ—అనూచానముగ, ఒకానొక 'భేషజము' — ఒకవిధమగు 'ధార్ష్ట్యము' ఒక వర్గములో - అనువృత్తమగుటఁజేసి — దైవమన్నచో-ఈ నాఁ డొకకొందఱు — ఊరక చప్పరింపవచ్చును. సరియగు బ్రాహ్మణ్యమే కఱవయి పోవుటచే 'బ్రాహ్మణ భక్తి' యన్న మాటయే పరిహాసభాజనమై పోయె. విష్ణ్వంశము గల రాజులే లేని రోజులలో 'రాజభక్తి' కవకాశమే లేదు గదా! గోముఖవ్యాఘ్రములవంటి—ఆస్తికమ్మన్యులు పెచ్చు పెరిఁగిననాఁడు 'నాస్తికత' సర్వత్ర వ్యాపించితీఱును. 'వర్ణములే' నడుమంతరపుసిరి యైననాఁడు—వాని యాశ్రమముల శ్రమ యెవ్వారు-ఆర్తుసు తీర్తురు? షట్కర్మము లను మాటయే వినను నోఁచుకోని శుష్కజాతికి 'షట్కర్మనిరతి' యెక్కడిది? కాఁగా— 'కృత్యవిచారణ' చేసి పూర్వాపరసమన్వయముగాఁ బరిశీలింతుమేని సనాతనభారతమునకు నవభారతమునకుఁ జుట్టఱికమే దూరమైనట్టు కన్పట్టును.

అచింత్యుఁడై—అతీంద్రియగ్రాహ్యుఁడై— సనాతనుఁడై— సర్వభూతమయుఁడై యొప్పిన — ఆ సర్వేశ్వరుఁడు సృష్టించిన — ఈ జగత్తులో విశిష్టమగు మానవజాతిలో విశిష్టములైన ధర్మములే వెలసియుండుట వింత గాదు. కాని, నాఁటి ధర్మములకు నేఁటి ధర్మములకు—అర్థమే వేఱుగాఁ దోఁచును. కారికలనుబట్టి వార్తికములను జూచి నేఁటి వాలకము నన్వయించుటలోఁ జిక్కులు పెక్కులు—ఉత్పతిల్లును. వానినే యుగధర్మములుగా—యుగపరిణామముగా సంభావించుటయే సంభావ్యమైన ధోరణి.

పెక్కు ఘట్టములలో వైదికవాఙ్మయమునకు - అనంతరవాఙ్మయమునకు సంబంధమే కానరాదు. అట్టి పట్టుల - 'ఆర్షము' - 'లౌకికము' - ఇత్యాది దళము లేవేవియో వ్యవహారమునకు వచ్చిపడినవి. వేదములలోని హరిశ్చంద్రుఁడే వేఱు. పురాణములలోని హరిశ్చంద్రుఁడు - అతఁడు కాదు. వైదికముగ వసిష్ఠ విశ్వామిత్రులు వేఱు. పౌరాణికముగ వారి వారి గాథలు వేఱు. తారాశశాంకమునకు - అహల్యాసంక్రందనమునకు సనాతనముగా నొక యర్థము; సాహిత్యముగా నొక ఘట్టము. పెచ్చుపెరిఁగిన దురాచారములు కాదన నోరు లేని - ఆ రోజులలో శ్వేతకేతువు - అవతరించెను. అప్పుడు 'దీర్ఘతముఁడు' - ఒక దివ్యమహర్షి. కాని వాని బ్రదు కట్టిదైపోయె? ఇంటిలో నీఁగల మ్రోత; బయటఁ బల్లకీ మోఁత.

వైదికముగా దేవేంద్రుఁడు - ఒక మహోన్నత 'శంకరపీఠాధిపతి.' వాఁడే నవరస గాథలలోఁ జేయి వేసిన శృంగార నాయకుఁడు. వాని చేఁతలు - నీతులు - బూతులు చిత్రవిచిత్రములు. అది యొక పెద్ద గ్రంథరాశి. అతఁ డొక పెద్ద 'గ్రంథసాంగుఁడు'. మహాభారతములోని 'నిజాయితీ' - బలిచక్రవర్తి వదాన్యత - జరా సంధుని బ్రాహ్మణ్యము పూర్వులు కొందఱు సమయోచితముగ సమన్వయించిరి. అవియే ప్రక్కటి పురాణములై పొక్కెను. పురాతనములో నవ్యత చొనిపి వర్ణించుటచే - పురాణ మయ్యెనట. కావుననే - ఈ గాథలలో - ఆదర్శమున వైవిధ్యము తోఁతెంచును. ప్రాయికముగా - ఈ ధోరణియే 'బహుధా విప్రతిపత్తి ధీవిభవముల్ పొడమైన శాస్త్రార్థముల్' అన్న మాటకు బీజమై యుండనోపు!

ఈ 'పరిణామ సూత్రములే' హృదయమునలోఁ బదిలముగాఁ గుదురుపఱచికొని 'కలిపురాణమును' పాఠకులు పరిశీలింపవలెనని మనవి.

గౌతమ శాపమునుగూర్చి పురాణ మిట్లున్నదని యుటంకింతుమేని-అది యొక పెద్ద 'రగడ'. నాఁడే 'విప్ర దుస్థితి'—ఇట్లాయె నని సోదాహరణముగఁ జూపింతుమేని-అది యొక 'బ్రహ్మద్వేషములో' లెక్క. వ్యాసుఁ డెవఁడో విదురుని కుదు రేదో కృపుఁ డెక్కడఁ బుట్టెనో ద్రోణుని జన్మ మెట్టిదో నిరూపింపవలె నన్న- మహాత్ములయు మహానదులయు పుట్టుపూర్వములు నీ కేల యని బూకరింపు. అక్కడఁ బట్టినప్పుడు — నీ కుల మేది? నీ గోత్ర మేది? నీ తండ్రి యెవఁడు? నీ తాత యెవఁడు? — అని యంపరలో — కర్ణునివంటి యభాగ్యులను నిగ్గఁదీసి యెగ్గు లాడవచ్చును. అమ్మయు నబ్బయు లేని — అజ్ఞునితో నూతవంశములోఁ బెరిఁగిన కర్ణుఁడు 'పోటీ' పడరాదఁట! ఇంతటి విచిత్ర మేమనఁగా—ఆశ్రయబలమే బలము. 'బ్రాహ్మణో మమ దేవతా' కావికలోఁ బెరిఁగి పెద్దలైన పాండవేయుల దృష్టిలో— కర్ణుఁడు, ఒకానొక 'కులము తక్కువవాఁ'డాయెను. బలీయమైన రాజాశ్రయము దొరకిన నిమేషమునుండి కర్ణుఁడు — ఒక దొడ్డ కొలమువాఁ డయ్యెను. అభాగ్యులకు- అనాథులకు 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అన్న ఓభీషికలే యెదురై వచ్చిపడును. ఇఁక — ద్రోణాదుల కన్ననో సమయోచితములైన సర్వధర్మ ములు స్వధర్మములే యగును.

భారతములో ముమ్మొదట ముచ్చటింపఁదగిన మహావీరుఁడు భీష్ముఁడు మొదలు నవభారతములోఁ జేయి మోపిన 'మోహనదాసు'వఱకు—ఈ 'కలిపురాణ' శ్రేణిలో వర్ణించితిని. 'పురాణ మిత్యేవ న సాధు సర్వ'మ్మను నట్టులు, కేవలము పూర్వయుగ ములవారే నైతికముగా దొడ్డవారని యనుకొనిపోవుట పొరపాటు. ఇదానీంతనులలో నెందఱో సత్పురుషులు గలరు. ప్రాచీనులలో నెందఱో 'దుర్బ్రాహ్మణుని' బోలిన దురాత్ములు కలరు. దేవేంద్రుని చేఁతలు నేఁడు చూడఁగా మిక్కిలి రోఁతలు. భీష్ముని పాక్షికవైఖరి రాజకీయముగా నేఁడు—ఇంపితము కాదు. ద్రోణుని యేకలవ్యవిషయక ధర్మము నేఁడు బ్రాహ్మణుఁడుగా వెగటు పుట్టించును.

అశ్వత్థామ నేఁడు చూచినచో—అక్కఱమాలిన వట్టి పిచ్చి సన్నాసి. సాంఘిక
మగా—ఆ ధర్మములు నేఁడు మన కధర్మములు. ద్రౌపదివంటి ధర్మపత్నులు నేఁడు
సంఘములో సరిగాఁ బొసఁగరు. గొంతివంటి యత్తలకు నేఁడు కులములో వన్నె
తక్కువ యగును. గాంధారివంటి వ్యక్తులుమాత్రము సర్వదా సర్వథా సర్వజనమాన
నీయులే యయ్యెదరు. పార్థసారథి 'చాణక్యములు' రాజకీయముగా మనోహరములే
కావచ్చును; పారమార్థికముగాఁ గాదు. దేవయాని చేసిన పనియే నేఁడు దేశములో
నెవ్వతెయేనిఁ జేసినచో—ఆ 'తీర్పు' వేఱుగా నుండును. ఆ 'భ్రష్టురాలికిఁ' దగినట్టులే
'శాపనార్థములు' దక్కెనవే పో! ఆబిడ తండ్రి శుక్రుఁడు మాత్రము—ఏమి
'నిర్వాహకము' చేసెను? అతఁడు 'సర్వశాస్త్రవేత్త కదా! సర్వతంత్ర స్వతం
త్రుఁడు గదా! వానివలన లోకమున కేమి యొఱగెను? ఒక్క బిడ్డయను మమ
కారముతో—ఆబిడ వేసిన గంతులు—చేసిన చేఁతలు—చూపిన యాగడములు,
తండ్రియుఁ గాదనలేదు. పైగా—అవియే ధర్మశాస్త్రములుగా శాసించెను; 'ధర్మ
పన్నములు'గా ఘోషించెను. వానిని మించిన ఘనుఁడు దేవగురువు బృహస్పతి.
కాంతాకనకాపేక్షలలో దేవగురువు మొనగాఁడా? దేవరాజు దొడ్డవాఁడా? అని
పించును. అవును—'యథా గురుస్తథా శిష్యః'.

ఇఁక వర్ణాశ్రమవ్యవస్థ యన్నది— ఒక పెద్ద 'కుంభకోణము'. చారిత్రిక
ముగా దాని బ్రదుకు చర్చించినచో— ఆ వ్యవస్థ నేఁటికి రెండువేలయేండ్లకు
మున్నే స్థిరపడినట్టులు తేలుచున్నది. అట్టి వ్యవస్థను నేఁడుకూడఁ బాటింపవలె
ననుటలో నెంతో ప్రమాద మున్నది. ఋగ్వేదములో నొకే యొకచోట—
చాతుర్వర్ణ్యోత్పత్తినిగూర్చి ప్రస్తావించిన సూక్త మున్నది. అది ప్రక్షిప్తమనియు
దాని నిటీవలివా రెవ్వరో దూర్చియుందురనియు 'మాక్సుమూలరు' మున్నగు మహా
విద్వాంసు లెందఱో యెన్నో బలవత్తరములైన కారణములచే నిరూపించిరి.

నిజముగా నీ నాఁడు శాస్త్రీయములైన నాలుగు వర్ణములు లేనేలేవు. 'కలి
యుగమందు బ్రాహ్మణులె కనపడ రంచు బృహత్పురాణమే పలికినది.' పరశురాముని
'ప్రయోజకత్వము'చే క్షత్త్రియజాతి విత్తనమే చచ్చిపోయినది. సూర్యచంద్రుల
సంతతి యన్నమాట వట్టి వినోదముల పుట్ట. సూర్యచంద్రమండలములకుఁ బిల్లలు
పుట్టిరనుట బొత్తిగాఁ బొసఁగని పిచ్చికూఁత. నేఁటి వైశ్యులు— ఆ వైశ్యులు
కారు. వీరికి వేదాధికారమును బైవారు ప్రసాదింపవలెను. ఇఁక 'శూద్రుల'
ఘట్టము :—

వీరును శాస్త్రములోని శూద్రులు కానేకారు. అది యొక పెద్దగాథ.

ఆర్యు లను— ఒకానొక జాతి యీ దేశములోఁ గాలు పెట్టిననాఁడు—
ఇప్పటి కైబరుకనుమల ప్రాంతములో— ఒక వీరజాతి యుండెడిది. వారినే
'క్షుద్రకు' లందురు. వారి సాహస శౌర్యము లత్యద్భుతములు. దేశభక్తిలో వారికి
వారే సాటిరాఁగల దివ్యమూర్తులు. పారతంత్ర్యమన్న భావమే వారికి బొత్తిగా

గిట్టదు. అలెగ్జాండరు— ఈ దేశముపై దండెత్తివచ్చిననాఁడు— అద్భుతమైన సాహసము చూపి యాతనిని ముప్పతిప్పలు పెట్టిన వీరజాతి— ఈ క్షుద్రక జాతి. గ్రీకులు వీరినే, క్షుద్రకీ - శుద్రకీ - సెద్రీ, అని చరిత్రలో వ్రాసిపెట్టికొనిరి. ఆర్య జాతి, ఈ వీరజాతిని మంత్రములతోఁ దంత్రములతో మారణాయుధములతో గెలిచి బానిసీలనుగాఁ జేసికొనిరి. ఓడినవారు గెలిచినవారికి బానిసీలగుట— ఆ నాఁటి రివాజు. పైగా వీరికి వారు శూద్రులని పేరు పెట్టిరి. మన్వాది ధర్మ శాస్త్రములలో శూద్రుల కిచ్చిన హక్కులు చేసిన శాసనములు ఘోరాతిఘోర ములు. వాండ్రకు— ఆస్తిపాస్తు లుండరాదఁట. చదువుసంధ్యలు పనికిరావఁట. శూద్రాయ మతిం న దద్యాత్— అని శాస్త్రము లల్లిరి. శూద్రకమలాకర మను పేర— ఒకానొక పరమనీచగ్రంథమును స్మృతిగా వ్యవహరించిరి. దానినిండ— శూద్రులకు సహస్రాధికశిక్షలు ప్రసాదించిరి. ఆ శిక్షలలో నణఁగిమణఁగి తమకు నచ్చునట్టులు నడచుకొన్నవాండ్రను— ఆర్యులు త్రైవర్ణికులలోఁ బొదిపెట్టిరి. నచ్చనివాండ్రను శూద్రులలో జమకట్టిరి. ఇదే శూద్రజాతి యుత్పత్తి. ఇంతే గాని భగవంతుని నోటిలో నొకఁడు—ఊడిపడలేదు. కాలిలో నొకఁడు జారి పడలేదు. 'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్— బాహూ ఊరూ పద్భ్యాం శూద్రోఽజాయత' అన్న మాటకుఁ బుట్టిరని కాదు భావము. విరాట్ పురుషునకు ముఖముగా - బాహువులుగా - ఊరువులుగా - పాదములుగా, ఆ యా వ్యక్తులు— అయిరనియే దాని యర్థము.

ఇంతకుఁ బండితార్థ మేమనఁగా—చాతుర్వర్ణ్య వ్యవస్థ సర్వము వట్టి బూటక మనియు - అది బొత్తిగా సహింపరాని క్షమింపరాని యొక పెద్ద మోసమనియు. జందెములో విశిష్టత యేర్పడిననాఁడు - ఈ వ్యవస్థలో మఱొకవిధమైన 'రాచ పుండు' పుట్టి పెఱొక విప్లవము తెచ్చిపెట్టినది. హిందూమతములో - ఈ 'జాతి తత్త్వము' పురాజ్వరమై పెరిఁగిపోయినది. దీనిని సమూలముగఁ బెల్లగించినఁగాని యీ దేశమునకు మోక్షము లేదు.

ఇప్పటికిఁ గన్పట్టు ధర్మశాస్త్రము లన్నియు రెండువేల యేండ్లనాఁటివి. అయ్యవి యీ దేశములో -అక్షరాల - అమలులో నున్నది యెన్నఁడును లేదు. పైగా నయ్యవి నేఁటి సంఘమున కేమాత్రమును బనికిరావు. బూజుపట్టి బుగిలిపోయిన అట్టి 'కాగితలను' ప్రదర్శించి చారిత్రకదృష్టిగా వాని సౌభాగ్య సౌందర్యములు చవి చూచుటకును - తన్నిర్మాతల సమకాలబుద్ధిని సౌశీల్యమును గుర్తించుటకును - ఏ 'మ్యూజియము' లోనో యుంచుట మేలు. అవి యక్షరాల నాచరణములో నేఁడు పెట్టవలెనన్న మాట వట్టి వెఱ్ఱి వెంగళప్పల బాట.

వర్ణాశ్రమధర్మ మను వంకతో వన్నె-చిన్నె లెన్నెన్ని వెలసినవో యెన్నఁగాఁ దరము గాదు. నోరు గలవానిదే రాజ్యము. నోరు - అనఁగా విద్య. అదియు వట్టి విద్య కాదు; బ్రహ్మవిద్య. ఆ ధనము నుండుఁ దక్కిన ధనములన్నియు 'బలా

దూరు'. కావుననే బ్రాహ్మ్యమును మించిన పదార్థమే లేదందురు. అది కలవాఁడు-ఆడినదే యాట; పాడినదే పాట. ధర్మము లన్నియు వాని మాటలో నొదుగవలె; వాని బాటలో నడువవలె. అదేమని యెవ్వరేని నోరెత్తిరేని హద్దుమీఱినట్టులై బ్రహ్మద్వేషముగాఁ బరిణమించును. బ్రాహ్మ్యమును ద్వేషించుట నిజముగా బ్రహ్మద్వేషమే కావచ్చును. అది గుర్తించుటలోనే విశేష మున్నది. నేఁటి హైందవములోఁ బుట్టి పెరిఁగి జాలుగా నేరుగాఁ బాఱు జాతిద్వేషమునకు మూలబీజములా నాఁటివే సుమా! కానిచో జ్ఞానమూర్తియై రాజర్షియై పరిఢవిల్లిన 'జనకుఁ' డేడ? అట్టివాని జ్ఞానమునే-ఆశంకించిన యాజ్ఞవల్క్యబ్రహ్మవాసు లేడ? అట్టి 'పశువులు' 'గాడ్సేలు' నేఁడుకూడ లేకపోలేదు. కావుననే 'మహాత్ముని'వంటి మానసీయులు మనకు దక్కవలసినంతకాలము దక్కలేదు గదా!

ఈ 'కలిపురాణ' శ్రేణికి నన్వయించిన యీ చర్చ సూత్రప్రాయముగా నిఁకఁ జాలును.

ఈ దృష్టితో - ఈ కావ్యమును సంతరించి యిప్పటికి-'పుష్కరము' కడచినది. తెలుఁగులో మిక్కిలిగా వెలసిన చంపూకావ్యముల త్రోవ గైకొనక కొంతకుఁగొంత సంస్కృతభాషాకావ్య ధోరణినే - ఈ కావ్యములో నవలంబించితిని. ఏకవిధమయిన ఛందస్సు - అవిచ్ఛిన్న భావప్రసారమునకు సహకార మీయవచ్చును. గేయపాఠ్యముగా మధురాతిమధురముగా సంతరించుకొన్న తన యాదికావ్యమును వాల్మీకి - ఏకచ్ఛందమున నడపించుకొనెను. ఒక్కొక్క సర్గములో నొక్కొక్క వృత్తమునే గైకొనుట సంస్కృతవాఙ్మయములో సంప్రదాయ మున్నది. తెలుఁగులో ద్విపద కావ్యముల ధోరణికూడ దానినే యనుకరించును.

రసపరిప్లుతికి - కథాగమనమునకు తెలుఁగు వృత్తముల వైవిధ్యము చాలఁగా సహకరించునన్నమాట సత్యమే యయ్యు, వచనమే మూచూడక - ఈ నాలుగు వృత్తములతోనే - ఇతివృత్తము నడపుట నాకు 'హాయి' కూర్చినది. అద్దాని మంచి చెబ్బరలను - ఇందలి యితివృత్తముతోపాటు లోకమునకే వదలి హృద్యములైన సవరింతలకై విద్వల్లోకము నర్థించుచు 'కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ' యని నిరీక్షింతును.

శ్రీ విలంబి - మార్గశీర్ష - బ - సప్తమి
అమృతలూరు

—సత్యనారాయణ చౌదరి



స్వామి సన్నిధిని :

అముద్రిత 'వస్తు' నివేదనము : శ్రీ సర్వజిత్తు-ఫాల్గున-శు-సప్తమి-బుధవారము
17–3–1948 మధ్యాహ్నము

ముద్రిత 'వస్తు' సమర్పణము : శ్రీ విళంబి-మార్గశీర్ష-బ-ఏకాదశి-సోమవారము
5–1–1959 మధ్యాహ్నము
'తిరుమల'

—సత్యనారాయణ చౌదరి

రచన మొదలు : 1946–8–20

# స్తవః

శ్రీ వేఙ్కటేశ్వర! నమో నమ ఆదిదేవ!
మాం పాహి భక్తజనరక్షక! దీనబంధో!
త్వామేవ దైవమితి సమ్యగహం నిరూప్య
నిత్యం స్మరామి పరమేశ! భృశం ప్రసీద।

2

అస్మిన్ యుగే భవదపారకృపాకటాక్ష
మాలా మవాప్య భవరోగవిమూరితాత్మా,
నిత్యానుమోద మధిగమ్య విరాజమానః
సంశ్రూయతే పరమభక్తగణః ప్రపఞ్చే:

3

అత్యంతతీవ్రతప ఏవ పురా నరాణాం
మోక్షస్య మూలమితి కశ్చన సంప్రదాయః,
దూరీకృతః ఖలు కలౌ భవతా విచిత్ర
మేతన్నిరూపయతి దేవ! భవత్ప్రభావః।



శ్రీ

# ఉ ప గ ర

తిరుమలమీఁది కాఁపురము దివ్యమహామహిమంబు సూప ము
ష్కరయగు మానవప్రకృతికాంతకు వింతను సంతరించు నీ
పరమకృపావిశేషపరిపాటికి ముగ్ధుఁడనై మదీయకా
వ్యరమను గానుకిత్తును దయామతి దీని గ్రహింపవే ప్రభూ!

౨

అనుకోనట్టి విధాన నా ప్రకృతి త్యాగాభ్యాససంగసంసర్గసే
వనధర్మంబును నిర్వహించె; నిఁక నీ వాత్సల్యమే యింతదాఁ
కను నన్నోమినదంచు నెంచియు మహాకావ్యంబుగా దీని ని
చ్చిన నీకే కృతియిత్తు; నియ్యది భవచ్చిత్తంబులో నెంచుమా!

౩

ఏవేవో యొక '*రాశి గ్రంథములు' నా యీ చేతిలో సృష్టియై
తావుల్ గుప్పిన వంతమాత్రమున 'హంబా' దక్కినట్లెంతునా?
నీ పుణ్యాపని యెంచి యీ కొలతలో నిన్నే నిరూపింపఁగాఁ
జేవల్ దేఱిననాఁడె నా కలము వైశిష్ట్యంబు మన్నించెదన్.

౪

ఏటేయుఁ గోరి నిన్నె భజియించుచు వ్రాసిన చిన్ని *కావ్య మా
ధారము గాఁగ నా కవనధార వెలార్చితి నిట్లు; కాన నీ
వారయ నుత్తమర్ణుఁడ వటంచుఁ దలంచి ఋణంబు నీఁగఁగాఁ
గోరియు నిచ్చుకొందు నిదిగోఁ గయికొమ్ము మదీయకావ్యమున్.

* ఇప్పటికి - ఏఁబది

* మ్రొక్కుబడి

౫

కృతిపతి వీవు కావుట భరింపకతప్పదు నీకుఁ; గాన నీ
కృతి నలు మూలలన్ వెలయురీతి నొనర్పుము-స్వామ్య మెల్ల ని
చ్చితి నని దాఁచుకోకుము : విశిష్య-వచింపఁగ నేల ? లక్ష్మికిం
బతివిగదా ! ప్రపంచమున భాగ్యము సర్వము నీదె కాదొకో !

౬

ఇది యీ రూపున వచ్చునంచు నెదలో నెన్నండు రూపించి నీ
యదిగాసైతము చూడనైతిని ప్రభూ ! యా నాఁటి కా నాఁడు స
మ్మదముం గూర్పఁగ-నంగసౌష్ఠవముతో ముప్రొద్దు కల్యాణ సం
పదలన్ గోరిన యావలన్ బతివి నీవా ? యంచు నూహించితిన్.

౭

అది యేమో మఱి చెప్పలేను మదిలో 'నర్ధాంగిగా' నీకె యి
య్యది నిశ్చాయక మంచు నెంచిన క్షణం బత్యంతమోదంబు నె
మ్మదికిం గూర్చె; నదే విశిష్టమగు సమ్మానంబుగా నెంచి యి
య్యది సాగించితి-నంతరాయ మిఁకఁ గాసంతైన లే దియ్యెడన్.

౮

ఎన్నఁడో తిక్కయజ్వ రచియించిన కావ్యము స్వామి కిచ్చి యీ
తెన్ను తెలుంగువారి కుపదేశము చేసెనుగాని నేఁడు మే
మున్న దశావిశేషమున కొప్పదు; కారణ మిట్టిదంచు నే
నెన్ననుగాని త్రోవ యదియే గొని-సాగెదఁ గొంత దూరమున్.

౯

పనిగా రేయుఁబవల్లు దీనిని మహాభాగ్యంబుగాఁ జూచి పెం
చిన నా డెందము స్వస్థతం గనె విభూ ! శ్రేయంబు లే, మిత్తువో
యని యత్రైత్తియుఁ జూడ; నంతయుఁ ద్వదాయత్తంబుగా నెంచి యుం
దును నా కేమి కొఱంత ? దీన - నిఁక నా నోముల్ ఫలం బీయవే !!

౧౦

ఎన్నఁడో చిన్ననాఁడు వెలయించిన గ్రంథముమాట యుంచి, వి
ద్వన్నుత ! నిన్ను మొన్న యవధానముగా నుతియించి హర్షమున్
గొన్న కవిత్వమే గణనకున్ సరిదెత్తును; నేఁడు - దీని నీ
తెన్నున నిచ్చుకొందును మదిం గుఱుతించియు నన్నుఁ బ్రోవవే !!

# అ భి న తి

తెనుఁగున కింత వాఙ్మయముదీప్తిని దెచ్చి తెలుంగుజాతి పెం
పెంపున కొక్క దోహదం బిడి యమూల్యకవిత్వమహత్త్వగుచ్ఛసం
జనితయశోవిరాజితదిశావలయావృత సౌరభంబు గు
ప్పిన మహనీయభారతకవిత్రయమున్ గణుతింతు నిచ్చలున్.

౨

తమ యనురాగసంపద యుదారమనంబునఁ బంచి యిచ్చి శ్రే
యము నొనఁగూర్చు విద్య యనయంబును బ్రోది యొనర్చి-నాకు స
త్క్రమముగ భావిజీవితసుఖంబు లెసంగ నొసంగియున్న యు
*త్తమగురువర్యులన్ గొలిచి తద్ఋణ మీఁగెద నీ విధంబుగన్.

౩

మఱియొక యాప్తు నిత్తఱి నమస్కృతితో స్మరియింప నేని సం
బర మది గల్గునెట్లు? 'శివభారత' మాతని కావ్యరాజమై
పరఁగఁగఁ దత్కవిత్వ పరిపాకము మత్కవితాస్రవంతికిన్
దిరమగు తెన్ను సూపఁగఁ బదింబది ముగ్ధుఁడ నైతి దానికిన్.

౪

ఇయ్యది చిత్తగించి తమ యింగితమున్ బ్రకటించి దాన నా
యొయ్యన నాదు డెందమున కూఁటగ గొల్పి మదీయదీక్షలో
నెయ్యము దియ్యమున్ బెనుపనేర్చిన విజ్ఞుల మత్కృతజ్ఞతా
ధాయ్యల సంస్తుతించియు ముదంబున నా విధి నిర్వహించెదన్.

---

* బ్రహ్మశ్రీ – మీమాంసశిరోమణి - కంబంపాటి స్వామినాథశాస్త్రి గారు
బ్రహ్మశ్రీ – విద్వాన్ - దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారు
శ్రీమాన్ – వ్యాకరణ శిరోమణి – కరి రామానుజాచార్యులు గారు
ఉ. వే. ప్ర. శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులవారు

M. A. [Hours]

| | | పుట | పద్యములు |
|---|---|---|---|
| **అనుక్రమణి** | | | |



[ మొత్తము ౬౦౮ పద్యములు ]

ఓం

# కలి పురాణము

## ప్రథమాశ్వాసము

### భారతము

కౌరవగాథలన్ వెదుకఁగాఁ గనవచ్చును ధర్మసూక్ష్మమన్
పేరట వింతమార్గములు; వేఱుగ వాని విమర్శదృష్టితో
నారసి యెంతుమా యొకటియైనను లెక్కకు నిల్వదైన—ఆ
ధోరణిమాత్ర మిట్టిదని తోఁచినమాటలు చెప్ప రెవ్వరున్. ౧

భారత మంత బొంకనుచుఁ బల్కిన పూర్వుల మాట బొంకు కా
నేరదు; కాని దానిదశ నేఁటికి నాఁటి కహీనమై మహా
గౌరవ మంది లోకమున గణ్యత కెక్కుట కాదికారణం
బారయ వ్యాసు 'గంటమని' యందును; జూతము దాని పోకడల్. ౨

మొత్తముమీఁద ధర్మజునిముందుఁ బురాణజనంబులోన నా
వృత్తిగఁ ద్రిప్పిచూపినను వేయికి నొక్కఁడు సాటిరాఁడు; త
చ్చిత్తములోన నున్నది విశిష్య—వెఱుంగను గృష్ణమూర్తియే
తత్తఱమందు నన్న నిఁకఁ దక్కినవారిని జెప్పఁబోలునా!! 3

పేరికి నేవురే కలరు; పెద్దగఁ గృష్ణుని జూచుకొందు రా
వైరులు వేలసంఖ్యకును వత్తురు; వారికి వీరు సాటి కా
నేరరు, పోరిలో నెవరినెత్తికి మూఁడునొ యన్న సందియం
బారఁగనుండె ఘోరసమరావనిలోఁ దొలినాఁడె;—అంతలో. ౪

డెందము కొందలంపడఁగ డీల్పడి ధర్మజుఁ డొంటిగా నిజ
స్యందన మట్టె డిగ్గి తమచావు ధ్రువంబని బిట్టు తోఁచి రా
జేంద్రదిర దూరమై తనయభీష్టము తీరమి చక్కఁజూచి చే
రెం దనతాత డగ్గఱకు రివ్వున, నెల్లరు తెల్లవోవఁగా. ౫

తాతయు వానిరాకకు ముదంపడి యుద్ధములోన లోఁతుగాఁ
బాఁతిన బుద్ధి సర్వము 'గబాలు'నఁ బైకి వెలార్చి ప్రేమలోఁ
జేతము మప్పి యాతని విశిష్టతకున్ వెఱఁగంది రమ్ము వ
త్సా, తరుణమ్ములోనె మము నారసి కోరుము కోర్కె యేదియో! ౬

నావుడు వాఁడు భక్తియు వినమ్రత చూపి మహాప్రభూ, మమున్
గావవె నీవు యుద్ధమునఁ గాలిడి కన్నెఱసేయ లెక్కలో
జీవులమై వసింతుమె ? విశేషదయామతిఁ జూతువంచు మే
మేవుర మిట్టిపట్టు మది నెంచియు వచ్చితిమయ్య యిత్తఱిన్. ౭

నిన్ను జయించువార లవనిం జనియింపరు; మాకుఁ బ్రాభవం
బెన్నఁడు దక్కునో యని యదేపనిగా సకలప్రయత్నముల్
మొన్నటిదాఁకఁ జేసితిమి ముందుగ నీవె యనుగ్రహింపలే
కున్నను మాకుఁ బుట్టగతు లుండునె ? పోదు మరణ్యసీమకున్. ౮

మొదటికె మోసమాయెఁ; దొలిముద్దనె మక్షిక పడ్డరీతిగా
నెదురగ నీవె యైతి విఁక నెవ్వరు చాలినవారు నీకు? మా
బ్రదుకున కెట్టి యాశ కనుపట్టదు; విన్నప మాలకించి స
మ్మదమును గూర్చి నీ మరణమున్ వివరింపవె! మమ్ముఁ బ్రోవవే! ౯

కౌరవపక్షమం దునికి గైకొని యుప్పును బప్పుఁ దించు నా
తీరుగ నుండి నేఁటి కది తీఱని 'బాధ్యత' యంచు నెంచి యా
చారముకోస మిచ్చుటకిఁ జయ్యన వచ్చిన భీష్ము బుద్ధియే
మాఱెను; ధర్మరాజనఁగ మానవమాత్రుఁడె! భూతలంబులో. ౧౦

వల్లె యటంచు ధర్మజుని వాక్యము మెచ్చియు వాని యీప్సితం
బెల్లను దీరఁగా సభయ మిచ్చెను భీష్ముఁడు; వార లిర్వురున్
మెల్లగ మాటలాడుకొని మేలును గీడును జూచి కౌరవుల్
తల్లడ మంద వక్రమగుదారిని బోయిరి పోరిలోపలన్. ౧౧

సంగరరంగమందుఁ దొలిసారిగ 'బోణి'గ వక్రమంబు చూ
పంగలవారిలో మొదటివాఁడయిపోయెను ధర్మరాజు; రా
జ్యాంగములోన ధర్మ మణువైనను సాగదు; ముక్కు సూటిగా
రంగులు మార్చువాఁడె యలరంగలఁ డెన్నివిధాలఁ జూచినన్. ౧౨

రెండవ 'వాయి' ద్రోణునిది, రేపటిమాటకు నట్టు చాఁపఁ డా
తండును భండనంబు బహుధా నడపింపఁగ నేర్చె; దానిచే
గుండెలు బ్రద్దలై తనకుఁ గూర్చెడి చుట్టము కృష్ణు వేఁడి యా
తం డొనరించు కృత్రిమవిధానమె నమ్మి జయంబు పొందెడిన్. ౧౩

పేరికి ధర్మరాజనిరి, వేమును మించిన చేఁదు-వానిలోఁ
గూరిన వస్తువై యొరులకున్ సులభంబుగ బుద్ధి కెక్క, దా
తీరుగ గట్టిపాకమున ధీవిభవంబు వెలార్చి స్వార్థమున్
గోరుచుఁ గోరనట్టు లడుగుల్ భువి వేయఁగ నేర్చు నిచ్చలున్. ౧౪

పాపము! వాఁడు కష్టములపాలయిపోయె, నరణ్యసీమలో
శాపహతుండువోలె ననిశంబును గందఫలాదిభక్షణం
బే పరమాన్నమై మెలఁగె నింతకు నెవ్వడ ధార్తరాష్ట్రులే
యీ పని చేసిరంచు నదియేమొ తలంతురు లోకు లిత్తఱిన్. ౧౫

అందఱి 'సానుభూతి'కయి యట్టులు సాఁచి మెలంగు, బన్నముల్
పొందియు బైటి కించుకయుఁ బొక్కఁడు; కాలము వేచియుండి కీ
డొందినవానికే శుభము లొందఁగవచ్చు నటన్న సూత్రమే
ముందుగఁ జూచు; ధర్మజుని మోస మెఱింగియుఁ జెప్ప రెవ్వరున్. ౧౬

అతనిప్రవృత్తి చిత్రమయి యప్పటి కేమి యెఱుంగనట్టివాఁ
డతఁ డనిపించు; నెమ్మదిగ నాతని చెయ్దములన్ని న్యాయప
ద్ధతిని బరీక్షసేయ నొక దారికి రావు, క్రమక్రమంబుగా
మతకరి యూహాలే వెడలి మన్నన సర్వము రూపుమాపెడిన్. ౧౭

మాటికిమాటికిన్ వెనుకమాటలు - చేఁతలు చెప్పి చూపి య
ప్పాటను ధార్తరాష్ట్రుల నెపం బిడి దెప్పుచుఁ దప్పుపట్టుచున్
గోటను బోవు నల్పమును గొడ్డలిపెట్టున కప్పగించి పో
రాటము పెద్దచేసి కురురాజ్యముఁ గూల్చిరిగాదె పాండవుల్!! ౧౮

వీరెవరయ్య! దేశమున వీరికి నంటును సొంటు కానరా
దేరికి వీరు పుట్టిరో? మఱెవ్వరు వీరిని సాఁకువారొ? యూ
రూరను వీరిఁగూర్చి కథ లుండుట కేది నిమిత్తమో? మహా
భారము పూని వీరి నిటువంటి బలాఢ్యులఁ జేసి రెవ్వరో!! ౧౯

ఎవరికిఁ బుట్టె బిడ్డ యితఁ డేడ్చుట కన్నటు లా యరణ్యమం
దవమతిఁ గుంతి - మాద్రి తమ యక్కఱ తీఱను గన్నపాపలే
చివరికిఁ బాండవేయు లయి చిక్కులు తెచ్చిరి; రాజ్యమందు మా
కివి తగునట్టి యూళ్ళనుచు నేడ్చుచు వేఁడిరి వారి వీరినిన్. ౨౦

తమకే చక్కఁగ హక్కు నిచ్చి భువిలోఁ దాముస్ మహారాజతే
జము పెంపారఁగ సాటిరాజుల మనస్తత్వంబు గుర్తించి రా
జ్యము నేలంగలనోము లే కలిగినన్ జాల్ - చాలు మాకైదుగ్రా
మములన్నంతఁగ భైక్ష్యమేల? యది దుర్మార్గంబు కాకేమగున్ !! ౨౧

కుదుటికిఁ బెద్దవాఁ డొకఁడు గ్రుడ్డియె యైనను దప్పదంచు వా
నిదె పరిపాలనం బనియు నిశ్చయ మాప్తులు చేసియుండఁగాఁ
దుది కిటు పాండవుల్ తమకుఁ దోఁచినరీతిని గూటసాక్ష్యముల్
పదిలము చేసి రాజ్యమున భాగము కోరిరి పాపచిత్తులై. ౨౨

వారికిఁ దండ్రు లెవ్వరో! వివాదము సేయము గాని వారిలో
నేరునుగాని కౌరవమహీశులు లేరిఁక వారిబిడ్డ లే
తీరుగ హస్తినాపురికిఁ దీర్పరులై పరిపాలనంబుచే
గౌరవ మీయఁగాఁ గలిగి కౌరవరాజ్యము గుత్తకొందురో!! ౨౩

అది యొక పెద్దసందియమె యైనను వారల తల్లు లిర్వు రా
విధముగఁ బిన్నతండ్రికిని బ్రీతిని గూర్చిన భార్యలంచు నె
మ్మది దయ కల్గి కౌరవులు మాయలు మర్మము లేవి లేక సాఁ
కెదమని వారి నేవురను గేరుచుఁ దెచ్చిరి చూచి రాప్తులై. ౨౪

అది యాధారము గాఁగ నేవురకు మర్యాదల్ మహారాజ సం
పదలున్ భోగము లుట్టి యూడిపడఁగా, భావించి కర్తవ్య మె
య్యదియో 'గూడుపుఠాణి' చేసి రిఁకఁ దద్వ్యాపార మేమాత్ర మ
ట్టిదిపోనిమ్మని సైఁచినన్ మొదటికే యాపత్తు తోఁచెన్ గదా! ౨౫

ఇఁకఁ దగదంచు నెంచిరి మహీశ్వరపుత్త్రులు ధార్తరాష్ట్రు; లే
నికబల మున్న భీముఁడును నెమ్మదిగాఁ దన యున్నయింటిలో
నికిఁ జని యున్న 'వాసము'లు నేర్పుగ లెక్కకు నిచ్చు ధూర్త జా
తికి నెనయై యనారతము తిప్పలు కొంపకుఁ దెచ్చె హెచ్చుగా. ౨౬

ఒకరికి నొక్కరన్న మఱి నోహరిసాహరి యయ్యె వారిలోఁ
దికమకలై విచిత్రమగు తెన్నునఁ బోయెడి పాండవేయులన్
సుకపడనిమ్ము, తండ్రి నిలఁ జూడని బిడ్డలటంచుఁ బ్రేమతో
సకలజనుల్ క్షమించి రది సాకుగఁ గైకొని యేకు మేకునై. ౨౭

మెలఁగిరి స్వేచ్ఛగాఁ దమకు మించినవా రెవరన్నయట్లు, మూ
ర్ఖులు నయి రాజపుత్త్రులను గ్రూరవిధంబున బాధవెట్టఁగాఁ
దలఁచిరి; లోకు లిట్టియెడఁ దప్పది యెవ్వరిదన్నమాటయే
పలుకకపోయి; రా వెనుకఁ బాండవు లన్నిట మించి రయ్యెడన్. ౨౮

వీరలు తండ్రిలేని ప్రజ వీరికి నిచ్చలు గ్రాసవాసముల్
వేఱెమి లేక చూడవలె; విజ్ఞులు వీరొక విక్రమార్కులై
వైరులఁ జీల్చి చెండెద రవారిగ వీరిని గారవించుటే
గౌరవమయ్యు మీ కనుచు జ్ఞాతులు కొందఱు బోధ సేయఁగా. ౨౯

ధృతరాష్ట్రుం డది నీతి గాదనుచు; సంధింపంగ నే రీతిగా
గతి లేదంచు నెఱింగి వారలకు నా కౌరవ్యులన్ వేఱుగా
నతిదూరంబున నుంచె; వారి కది యే 'ప్రారబ్ధమో' యేకవా
క్యత రవ్వంతయు నుద్భవింప దిఁకఁ దద్వ్యాసంగమే భిన్నమౌ. ౩౦

పాండవు లెన్నఁడేని సగపాలును గోరఁగరాదు; కాని మా
తండ్రి గడించియున్న వసుధాతల మిమ్మని దేవురింపుగా
మొండిగఁ గోరుచుండుటకు మూలము రాజ్యవిభాగమన్న నె
వ్వండును శాస్త్రసమ్మతము భావ్యమటంచు వచింపకుండుటే. ౩౧

వెనుకటి రాజవర్గమున విక్రమ మున్న జయించి రాజ్యమున్
గొనుటయుఁ గద్దు; కాని తమకున్ నిఖిలంబును బంచి యిచ్చివే
యను దలపెట్టుపుత్త్రు లెవరైనను గానఁగవత్తురే! యిదే
మని యొకఁడేని యొక్కతడవైనను బుద్ధులు చెప్పఁ గూడదా!! ౩౨

భాగము లేని యంశమును బాండవు లేవు రెఱింగియుండియున్
భోగములన్నఁ గోరికలు పుట్టి పెనంగిరి; హక్కు కోసమై
'ఆగము' చేసి రా వెనుక నందఱి గడ్డము కాళ్ళు పట్టి యే
దో గతి చూచుకోఁదలఁచి రోషినవట్టుగ శక్తి చూపియున్. ౩౩

కౌరవులన్నఁ బాండవులు కాదని గ్రంథము లన్ని చెప్పఁగా
నేరికి హక్కు లున్నవో, మఱెవ్వరు రాజ్యము చేయ నర్హతన్
గోరిన రాదో స్పష్టమయి కొంత వివాదము తేలిపోవదా ?
వారును పేరు తీర్పఁదగు 'బాధ్యత' యేదియు లేదు దీనిలో. ౩౪

ఇరువురు మాట వచ్చి కలహించిన, వారి పిఱుంద నెందఱో
పొరుగున నున్నవారు తమ పుట్టి మునింగినయట్లు వాదవై
ఖరి నెసఁగొల్పి రేఁపి తమకంబును జూపుట చూచుచుందు; మా
తెరువున వీరి నిర్వురను ద్రిప్పిరి వాదములోన నెవ్వరో. ౩౫

కూడును గుడ్డ లేక తమకుం గతిగాఁ గురునాథుఁ జేరి యాం
ఱేఁడొనరించు మన్ననలు ఱేపును మాపును జూఱఁగొంచు నా
నాఁడు బలంబు గూర్చుకొని న్యాయముమాటకు 'స్వస్తి' చెప్పి వా
దాడెడి పెద్ద లట్టిసమయంబునఁ దీర్పరులైరి ఱేనికిన్. ౩౬

అంతిపురంబులో నిటు లయాచితులయ్యు 'విభీషణాత్ము' లా
వంతునఁ జేరి పాండవుల పక్షము వ్రానిరి; దానఁ జేసి య
త్యంతము దుష్పథంబున విహారము సేయఁగఁ జొచ్చి పూర్వవృ
త్తాంతమె విస్మరించి రిఁక ధర్మ మెఱుంగని పాండవోత్తముల్. ౩౭

మదమునఁ బొంగిపొంగి నదుమంతరపున్ సిరిఁ గోరికోరి య
య్యదనున రాజ్యభాగమునకై వలలొడ్డిన పాండుపుత్త్రులన్
గుదురుగ నుంచుటే తమకుఁ గొంపకుఁ జేటని ధార్తరాష్ట్రు ల
య్యది గుఱుతించి వారి పొగ రంతయు రూపఱఁ జేసి రయ్యెడన్. ౩౮

వెనుకటి కర్మమే నిలిచి వేళమ పాండవు లా యరణ్యసీ
మను గడగండ్లు పొందఁగల మార్గమె పట్టిరి; కానిచో మహా
శను దమశక్తి చూడకయె చట్టున జూదమువంకఁ బోదురా?
అనయము వారి నెన్నుదుట నా విధి వ్రాసిన వ్రాఁత తప్పునా!! ౩౯

పుట్టి యరణ్యభూములను బుద్ధులు నేర్చిరి; కాననంబులో
మెట్టిరి ద్యూతవృత్తిని దమిం గడుఁ జూపియు, నట్టివారి కే
పట్టున రాచఠీవి పొరపాటుగనైన లభించు? భూమిలో
నట్టి యభాగ్యు లెట్టి దశలందిరో? యంద ఱెఱుంగకుందురా!! ౪౦

తప్పని గుర్తెఱుంగక మదంబున జూదములోనఁ జొచ్చియున్
ముప్పును బొంది, యా గడువు పూర్తిగఁ జెల్లినదంచు వచ్చి, మా
యప్పును దీర్పఁగావలె నటంచు మదంబున విఱ్ఱవీఁగి తా
రప్పగిదిన్ విచిత్రముగ నంపిరి కృష్ణుని రాయబారిగా. ౪౧

ఆతఁడు వీరి కాప్తుఁడయి యల్లన 'హస్తిన' కేఁగి, కౌరవ
వ్రాతము గౌరవం బొసఁగఁ బాండవపక్షము వూని వారి కే
నీతులొ కప్పదెప్పలుగ నేర్పియు సంధి పొసంగరాని యా
చేతలె చూపి సర్వమును జిందఱవందఱ చేసె నక్కటా! ౪౨

తాను మదిం దలంచినవిధం బొకయింతయు నోలగంబులో
ఱేని సమక్షమందు వివరించెనె కృష్ణుఁడు? కైతవంబునే
పూనెనుగాని న్యాయముగఁ బూర్వమహీశ్వరసంధికార్య మే
దైనను దృష్టిలో నిడి ప్రయత్నము చేయ ఫలింపకుండునే!! ౪౩

ఎడపెడ ధార్తరాష్ట్రులకు నెబ్బెఱికంబుగఁ దోఁచుధోరణిన్
బుడిబుడిమాట లయ్యెడఁ బ్రబుద్ధుఁడు కృష్ణుఁడు పల్కి కొల్వులో
నొడుదొడుకుల్ పొసర్చి తమ కొయ్యన సేమము కూర్పనట్టి యొ
క్కఁడు పలుకైన నొప్పనని గట్టిగఁ దేల్చిన మెచ్చుకొందురా!! ౪౪

చేరిననాఁడె భోజనము చేయను రమ్మని జీరి కౌరవుల్
గౌరవ మిచ్చి కోరఁగను గాదనిపోయె మఱొక్కచోటికిన్
నేరము లిట్టివట్టివని నేర్పునఁ గొల్వునఁ బేరువెట్టి యా
తీరుగ దాటి కౌరవులఁ దిట్టిన నెట్టులు సంధి గిట్టునో! ౪౫

సంధి యొనర్ప వచ్చెనను సాకును జూపుటె కాని పాండవా
నందమె తాను గోరి కురునాశము బుద్ధిఁ దలంచి వచ్చి, రా
జ్యేందిర మూటఁగట్టుకొని యేఁగుటకై యతఁ డన్నిమాయ లా
చందముగా నొనర్చెననుసంగతి లోక మెఱుంగకుండునా!! ౪౬

పోవుచుఁ ద్రోవలో నొక యపూర్వకుయుక్తిని బన్ని స్వీయదు
ర్భావము చూపి కర్ణుని స్వభావము ద్రిప్పఁగఁ బాటువడ్డ మా
యావికిఁ గృష్ణమూర్తి కొక న్యాయము ధర్మము గానుపించునా?
కావున నిట్టి గాథలకుఁ గన్నులు కాళ్లను లేవు భూమిలో. ౪౭

అక్కజ మైనపట్టుల మహామహుఁ డీతఁడు పాండవేయులన్
జిక్కులఁ బొందనీయక విశిష్టపథంబునఁ జూచు; దానిచే
నక్కడఁ బాండుపుత్త్రు లనయంబును నక్కను ద్రొక్కివచ్చు నా
చక్కని సర్వకార్యముల సత్ఫలితంబులు పొంది రిమ్ముగా. ౪౮

తుది కిరువాగులన్ సమరదుందుభి మ్రోగెను; లోకభీకరం
బది యని యందఱున్ దెలిసి యప్పటి మైకము కన్నుఁగప్పి పెం
పొదవ, నపూర్వభేదముల కొండొరు 'లాహుతి'యై ప్రభూతస
మ్మదమునఁ దేలి రంతట గుముల్ గుములై కురుభూమి నెల్లెడన్. ౪౯

అలఁతి యలంతి సేనల సహాయము పొందియు ధర్మరాజు కా
వలసిన ధైర్యసార మొకవంకను దమ్ములు—వాసుదేవుఁడున్
పలుకులఁ జూపి రేఁబవలు పట్టినపట్టును గట్టిసేయఁ బె
ద్దల కెదురైనవారికి ముదంబున సాఁగిలి మ్రొక్కఁజొచ్చెడిన్. ౫౦

కౌరవపక్షమం దధికగౌరవ మందిన ద్రోణభీష్ము లా
భారము తామె పూనియు స్వభావములోఁ గురురాజునాశమే
కోరియుఁ బాండుపుత్త్రులకుఁ గూర్చినచుట్టములై విచిత్రమా
ధోరణి చూపి రాజునకు ద్రోహము సేయఁదొడంగి రయ్యెడన్. ౫౧

వెనుక విరాటరాజు కురువీరులఁ దాఁకిననాఁడు పాండుపు
త్త్రుని గుఱుతించి భీష్ముఁడును—ద్రోణుఁడు లేనగ వంకరింప నె
మ్మనమున సంతసం బొదవ మాయలు వన్నియు నా రహస్య మా
జనపతి కించుకంతయు నిజంబుగఁ జెప్పియు ముప్పు గాచిరే! ! ౫౨

ద్రోణుని కొక్కఁడే కొడుకు ధూర్తమనస్కుఁడు, వాఁడు తండ్రికిన్
బ్రాణము; వాని నెన్నఁడు ధరాతలమం దెవఁడేనియున్ ధను
ర్బాణము వట్టి చంపఁగలపద్ధతి లేదని విశ్వసించి గీ
ర్వాణులనైన భంగపఱుపంగల బిడ్డగఁ జూచుఁ దండ్రియున్. ౫౩

తండ్రికి బిడ్డకున్ గుడువ-దాల్పను గూడును గుడ్డ నిచ్చి వా
రండగ నుండి వారి మరియాదను బెంచినవారు కౌరవుల్;
భండనమందు జేసికయి ప్రాణములైన నొసంగి మార్తురన్
జెండియు స్వామిమేలునకు సిద్ధము కావలె న్యాయ్యదృష్టిలో! ౫౪

కాని యదేమొ వారు మొనగాండ్రని పేరు ప్రతిష్ఠ లంది స
మ్మానము లొంది యుద్ధము సమస్తవిధంబుల సిద్ధమైన, నే
మైననుగాని యన్నటు లొయారము సూపిరిగాని శ్రద్ధగా
జేని విపత్తులో ననుసరించి మెలంగిరె కొంచెమేనియున్! ౫౫

కొడు కొకనాఁడు కౌరవుల కొల్వునఁ గర్ణునితోడ మాటలో
వడిదుడు కేర్పడన్ దనదు పౌరుష మద్యొడ లెస్సఁజూపి సం
దడి యొనరించి ముంచుకొని దగ్గఱు యుద్ధముమాట పీడి యా
అడిఁ జనుదెంచె నింటికిఁక రాజున కెంతటి నష్టమో కదా! ౫౬

బిడ్డకుఁ బాలు లేక నిఱుపేదతనంబున దేవురింపుగా
నడ్డము వచ్చువారలను యాచన చేసెడి ద్రోణుఁ డెట్టులో
గడ్డము కాళ్లు వట్టుకొని కౌరవనాథుని పంచఁ జేరి యా
చెడ్డ యవస్థ పోనడఁచి, చెందె మహాదశ నేఁడు చూడగన్. ౫౭

యుద్ధము వచ్చి మీఁదఁబడి యుద్ధతి చూపెడివేళఁ గొల్వులో
హద్దును బద్దు లేక తమ యర్హత చూడక జేనికే మహా
బుద్ధులు నేర్పఁజొచ్చి రిఁకఁ బూర్వచరిత్రము కొంచెమేనియున్
బుద్ధికి రాక తండ్రియును బుత్త్రుఁడు; వారిదె రాజ్యమన్నటుల్. ౫౮

తల్లికిఁ దండ్రి కొక్కఁడయి దర్పము సూపుచు డాంబికంబులన్
జెల్లుగఁ బల్కు, నావల బిభీషికలన్ బెదరించు, రాజునే
యల్లరిఁబెట్టి రాజ్యమున కాపద మూఁడెడిత్రోవఁ బోవు నా
బల్లిదుఁడైన ద్రోణుసుతు పద్ధతి యిట్టిది హస్తినాపురిన్. ౫౯

అరయఁగ సొంత లాభముల కట్టులు సాఁచుచు ధార్తరాష్ట్రు లె
వ్వరికిని మేలు కూర్పఁదగు భావమె లేశము లేక స్వార్థత
త్పరులయి ద్రోణ భీష్మ కృపవర్గము యుద్ధములోన కుట్ర చూ
పిరి తమ ఱేని కయ్యెడలఁ బెక్కులు చిక్కులు తెచ్చి హెచ్చుగా. ౬౦

చిన్నతనంబులోఁ జదువుచేఁ జెలికాఁడని ద్రోణుఁ డేదియో
పన్నుచు నోలగంబున 'గబాలునఁ' బల్కిన మాటఁబట్టియే
కన్నెఱచేసి పొమ్మనియెఁ గావున నా ద్రుపదుండు ద్రోహిగా
నెన్నిక యయ్యె ద్రోణునకు; నిట్టిది యాతనిపొట్ట నుండుటన్. ౬౧

వానిని జంపఁగావలయు భావము ద్రోణున కుండె, దాని కే
దేనియుఁ గారణం బొకటి యిమ్ముగ రావలె నంచు వేచినన్
గానఁగవచ్చె ఘోరమగు కౌరవపాండవయుద్ధ మిందులోఁ
బూనెను గార్యభారము నపూర్వవిధంబున ద్రోణుఁ డంతటన్. ౬౨

కౌరవపాండవుల్ పెనఁగి కయ్యము చేసిన దాన నెందఱో
'మారణహోమ'మంది తన మాటకు వ్రేటున కెవ్వఁడేఁ బ్రతీ
కారము సేయలేని దశ కల్గెడు - నప్పుడు రాజ్య మంతయున్
గోరి సుతుండె యేలునను కుత్సితభావము పొందె ద్రోణుఁడున్. ౬౩

ఇది విడ్డూరము కాదు - వాని మదిలో నేవేవియో యూహ లి
ట్లొదవన్ గత్తి కటారు పట్టి సమరం బోరంతప్రొ ద్దాముచే
నెదిరిన్ డీకొని చేసి, తీవ్రదశలో నెవ్వాఁడొ మీ బిడ్డ యా
పదలోఁ జిక్కెనటన్న గుండె యవియన్ బ్రారబ్ధమం చేడ్వఁడే! ౬౪

ఐనను వాని మాటలు యథార్థములంచును నమ్మనేర, ని
ద్దానిని ధర్మరాజుపుకు దాఁపక చెప్పిన నొప్పుకొందు - ఆ
పైని విధిప్రయోగ మెటు భావ్యము కాఁగల దట్టులే భువిన్
గానఁగవచ్చునంచుఁ దన కర్మము రోసెను ద్రోణుఁ డత్తఱిన్. ౬౫

అదియే మంచి యమూల్యమైన తరుణం బద్దానిఁ గాదన్న నా
పద తీఱన్ గతిలేదు; సందియముగా భావింపరాదంచు నె
మ్మదిగాఁ గృష్ణుఁడు బోధసేయ నది దుర్మార్గంబుగా నెంచి త
ప్పదు నాకంచుఁ దలంచె ధర్మజుఁడు తద్భావంబు గుర్తింపరే!! ౬౬

ఏనుఁగు చచ్చెనన్న నెప మేదియొ చాటున దాఁచి మాటలోఁ
దేనియ పూసి ద్రోణుఁ గడదేర్చెను బాప మజాతశత్రుఁ డెం
తేనియు ధీరుఁ డా పని మఱెవ్వఁడు సేయఁగ నేర్చు భూమిలోఁ
గానఁగవచ్చునా యొకఁడుగాని విచారణచేసి చూచినన్. ౬౭

తన సంకల్పము సర్వ మిట్టులు నిరాధారంబుగా రూపు మా
సెను జన్మం బిఁక నేల యిస్సి! యని తచ్ఛ్రేయంబు కాంక్షించు తే
నిని దన్మిత్రుల విస్మయంపఱిచి యా నిర్భాగ్యుఁ డా రీతిఁ బా
సెను ప్రాణంబులు పాండవేయులును దత్సేనల్ ముదంబందఁగా. ౬౮

ఇట ధర్మాత్ముఁడు ధర్మరా జనుట కేదే తగ్గ యాధార మొ
క్కటి కాన్పించునె! వాఁడు యుద్ధ మిటులే కావించె నాద్యంతముఁ;
నిటలాక్షుం డిటు లెత్తివచ్చిననుగాని మ్మాతనిన్ బట్టి య
క్కట! యిట్లే తనువంగఁ జూచుఁ దుదికిన్ గాపట్యమే భిక్షగా. ౬౯

ఎఱుఁగనియట్టు లుండి యతఁ డిట్టి బలాఢ్యుల ద్రోణభీష్ములన్
బొరిగొనెఁ; బాండవేయు లిఁకఁ బోర జయింపను గర్ణుఁడే సరా
సరి యెదురయ్యె; నెట్టి యగచాట్లకునైనను లోఁగి శల్యుఁ-ము
ష్కరుఁ దిరిపంబుగా నడిగి కర్ణుని చావును జూచి రయ్యెడన్. ౭౦

ఇరువురు పోయి రా వెనుక నిట్టి ధనుర్ధరుఁ డొక్కఁడేని యా
కురుబలమందు లేఁ డతనిఁ గూల్చుట కెన్ని కుయుక్తు లున్నవో
యెఱిఁగిన వన్ని కృష్ణుఁ డొకయించుక సంశయ మెంచకే ధురం
ధరుఁడయి చూపెఁ; బార్థునకె ధర్మము కాదని తోఁచె నత్తఱిన్. ౨౧

ఎవఁడో యొక్కఁడు బ్రాహ్మణబ్రువుఁడు తా నేదో పరబ్రహ్మసం
భవవిఖ్యాతుఁడువోలె, గొడ్డొకటి తద్బాణంబుచేఁ బడ్డదం
చు-వివాదంబును దెచ్చి కర్ణుతలకున్ జుట్టెన్ మహాదోష; మిం
త విరుద్ధం బొకఁ డున్నదే! యదియు నేతన్నాశమున్ జేసెనా!! ౨౨

అరదము గ్రుంగిపోవఁగ మహారథుఁ డాతఁడు క్రింద దూఁకి చె
చ్చెరఁ దన మూఁపునన్ బొదవి, చిందఱవందఱ సేయు పార్థు ము
ష్కరశరజాల మెత్తెఱి విశాంపతు లెల్లరు తెల్లవోవ న
చ్చెరువుగఁ ద్రుంచి మీఁది కటు శీఘ్రముగా నొక ప్రక్క యెత్తినన్. ౨౩

రెండవ ప్రక్క గ్రుంగు; నది క్రీడికి సంతసమయ్యె ధర్మమై
యుండక యాఁగి దిగ్భ్రమము నొందినఁ గృష్ణుఁడు పార్థుఁజూచి, యీ
తండు మహాపదన్ దగిలి తల్లడ మందనినాఁడు వీని నె
వ్వండు జయింపలేఁడు, విడవన్ మన యత్నము వ్యర్థమే యగున్. ౨౪

కావున వీని నిప్పుడె యొకాయెకి తీవ్రశరాగ్ని కాహుతిన్
జేవ దలిర్పఁ జేసి మన చిక్కును దీర్పఁగ భావ్య మింతఁగాఁ
గావరమున్నవాఁ డొకఁడుగాని తలంపఁగఁ గానరాఁడు, దు
ర్భావము మాని-వేయు మిఁక బాణపరంపర యంచు నొత్తినన్. ౨౫

అంతట నెవ్వగన్ బొగిలి యానని కాదని పల్కలేక యా
వంతునఁ బార్థుఁ డయ్యది 'ముభావము'గా మది నెంచి తాను గా
లాంతక మూర్తియై యతని యప్పటివైఖరి తోడు సేయ ని
శ్చింతగఁ గూల్చెఁ; బాండవుల చేఁతలలోని రహస్య మిట్టిదే! ౨౬

ధీరుఁడు కర్ణుఁ డిట్టులు గతించుట కెందఱొ కారణంబుగా
నారయ నుందు; రందఱకు నగ్రసరుండగు శల్యుఁ డాతఁ డా
తీరుగఁ గర్ణ సారథిగఁ దేరిని జొచ్చి కలంచివైచె నా
వీరుని మానసంబు నవివేకి యతం డొక స్వామిభక్తుఁడే! ౭౭

మొద లొకపక్షమే తనకు ముఖ్యము కావు లెఱింగి దారిలోఁ
గుదురుగ ధార్తరాష్ట్రు లొనఁగూర్చిన మేలునుబట్టి బుద్ధియున్
జెదరియు గొత్తవోలెఁ దన స్నేహము వారికి బాసచేసి స
మ్మద మొనరించె; నావల సమూలముగా నది రూపు మాసెడిన్. ౭౮

వీని విచిత్రవైఖరికి విస్మయ మొందిన ధర్మరాజు స్వ
స్థానముఁ బాసిపోయెనని దందడి నెంది రహస్యవేషమున్
బూనియుఁ జేరి మామయని పొల్లుగఁ గల్లలు గొన్ని కూసి మా
మానము గాచి యల్లురకు మన్నన సేయవె యంచు వేఁడినన్. ౭౯

నీచుఁడు శల్యుఁ డయ్యది యనిందితమార్గము గాఁగఁ దోఁచి యా
పాచిక యట్లు కౌరవుల పక్షములో వసియించి వైచె; 'లా
లోచి' యొనర్చి కర్ణునికి లోపము లంటఁగ నొక్కి పల్కి మా
యాచరణంబు సూపె; నది యాతని నైజ మటంద్రు పెద్దలే. ౮౦

తుద కతఁ డొక్కనాఁడు రణదుందుభి మ్రోఁగినఁ బొంగి, శీఘ్రమే
యెదురుగ వచ్చు ధర్మజుని కిచ్చెను 'కోపు'; పురే! యటంచు వాఁ
డది యవకాశమై తన మహాబల మంతయుఁ జూపి వాని బె
ట్టదరఁగనేయ బొమ్మవలె నట్టె యతం డొఱగెన్ ధరిత్రికిన్. ౮౧

అందఱు మ్రంది తోడుపడ నక్కడ నెవ్వరు లేక యొంటిమైఁ
గొందల మంది స్వాస్థ్యమును గోరి మడుంగునఁ జేరె రాజ రా
జెందఱునో రహస్యముగ నిచ్చట నచ్చట గూఢచారులన్
మందలు త్రోలి జాడ లొకమాదిరిగా గుఱుతించి పాండవుల్. ౮౨

శౌరిని వెంట వైచికొని చయ్యన నందఱు వచ్చి నీటిలోఁ
జేరి కలంచి రెల్లెడలఁ; జిక్కుట కాతని విద్య వీరిలో
నేరికి రాదు; కావునఁ బరేంగితమున్ గుఱుతించు కృష్ణుఁ డ
వ్వారికి 'వానిఁ దిట్టి పిలువంగ'ను బోధ యొనర్చె యుక్తిగా. ౮౩

వారలలోన ధర్మజుని వాక్యములే యెద గ్రుచ్చుకొంచు దు
ర్వారపరాభవానలము భగ్గున రేఁపఁగ రాజరాజు క
న్నారఁగ వారిఁ జూచి తన యప్పటిదైన్యము మ్రింగి ధీరుఁడై
వైరుల మ్రోల నిల్చె; నిఁకఁ బాండవు లాతనిఁ జూచి యీసుమై. ౮౪

పలికిరి యోరి, నీ విపుడు భండనముం బొనరింప నొక్కనిం
బిలిచిన వత్తు; మిప్పటికి బీరము లన్ని యుడింగి దారిలో
నిలిచితివంచు నెంచితిమి; నీ కెవ రిష్టులొ కోరుమన్న న
ప్పలుకులు సూదిపోటులయి పాపము! చుఱ్ఱునఁ గాఁడి యిట్లనెన్. ౮౫

దైవము తప్పఁజూచినను ధర్మము తప్పనె క్షత్రియుండు? మీ
రేవురు నేకమై సమర మే విధిఁ జేసిన నేను గాదనన్
బోవను; నాకుఁ గైదువులు బొత్తిగ లే వవి కూర్చి మీర లే
త్రోవను జూపినన్ వెనుకఁ దూఱను; వెంగలిఁగాను మీవలెన్. ౮౬

నా విని కృష్ణుఁ డాతని మనంబున రోషము పెంచి, వీరిలో
నీవనుకొన్న మానిసియె నీ కెదురై బవరం బొనర్చు; నీ
చావును జూచిపోవలయుఁ జాలఁగఁ గాలవిలంబనంబు యు
ద్ధావనిలో నొనర్పము; జయంబు ధ్రువంబయిపోయె వీరికిన్. ౮౭

అనవుడు వాని మాటలకు నల్గియు రివ్వున లేచి చచ్చుపు
చ్చును గొని సంబరంపడఁగఁ జూతునె! భీమునితోడిపోరె నా
కనువగు, వీర లెందులకు? నంచు నెగాదిగ వానిఁ జూచి ర
మ్మని తొడఁగొట్టె నౌర! యది యాతని పౌరుషమై వెలార్పఁగా. ౮౮

ఇరువురి కప్పు దుద్దవిడి నేర్పడె భీకరయుద్ధ; మందు నొ
క్కరుఁ డొమగంగఁబోవఁడు ముఖాముఖి హుమ్మని ముష్టితాడనం
బరుదుగఁ జేసి తుట్టతుద కందఱు మెచ్చ గదాప్రహారంబు నే
ర్పెఱ నొనరించి; రట్టిది కడిందిగఁ గన్నులపండువయ్యెడిన్. ౮౯

చిన్నతనంబులో నుభయశిష్యులఁ బ్రేముడిఁ జూచి కార్యని
ష్పన్నత కల్గుదాఁక గదపండువు చేసి సమస్తవీరలో
కోన్నతి వారి కిచ్చిన గురూత్తముఁ డా బలరామదేవుఁ డా
సన్నవిషాదమూర్తి యయి సర్వము సాక్షిగఁ గాంచె నత్తఱిన్. ౯౦

ఒకనికి నొక్కఁడోడుటయె యుండదు; కాని యదేమొ భీము శ
క్తికి నొక 'కుంటు' కానుపడె; దీనికిఁ గారణమేమొ వారి కే
రికి మది కెక్కదయ్యె వివరించినవారును లేరు, ధర్మరా
జకట! విచారసాగరమునందు బుడుంగున మున్గె నంతలో. ౯౧

తికమకలైరి తమ్ములు విధిం గడు దూఱఁగసాగి రార్తులై
యొకనికి నొక్కఁ డాప్తుఁడయి యోర్మి తలంగియుఁ గ్రిందుమీఁదునై
వికలమనస్కులైరి; యది వెన్నుఁడు చూచి విషాదబుద్ధి వా
రికి మొదలంటఁ బోవుటకుఁ గ్రీడికి నేదియొ చెప్పె యుక్తిగా. ౯౨

ఆతఁడు వెంటనే యతని యగ్రజు భీముని హెచ్చరించి యే
దో తమ పుట్టి మున్గినటు లూరువు తట్టెను; దాని సైఁగగా
నీతఁ డెఱింగి డస్సి యిఁక నేదియు మార్గము లేక భీరులై
నీతికి 'స్వస్తి' చెప్పి యతనిన్ దొడమీఁదను గొట్టె నెట్టనన్. ౯౩

అది శాస్త్రీయము గాని వ్రేటగుటచే నా రాజరా జంత నా
పదకున్ లోఁగియుఁ గూలిపోయె; భువిలోఁ 'బ్రారబ్ధ' మీ రీతి ను
న్నది కాఁబోలు! గురుండు పాండవుల సన్నాహంబు గుర్తించి బె
ట్టిదమౌ కోపము రేఁగి పాండవులతో డీకొంచు యుద్ధానకున్. ౯౪

తలపడ్డన్ గథ యడ్డమై తిరిగెఁ దద్యత్నంబు దుఃఖాంతమై
మెలివడ్డన్ గతి లేక పాండవులలో 'మే-మే'లు సాగంగ ని
ట్లలవోకన్ నిఖిలం బుపాయములతో నాద్యంతమున్ దీర్చు మా
యల బైరాగి యుపేంద్రుఁ డన్నను గడున్ బ్రార్థించెఁ గార్యార్థియై. ౯౫

వానికిఁ బాండవాధముల పాపపుఁ జేఁతలు బుద్ధి కెక్కె, నే
మైనను గాని వీరి 'పుట మార్చెద' నంచుఁ గడింది యత్నమున్
బూనిన యన్న యుద్ధృతము పూర్తిగఁ దగ్గెడి మందు తమ్ముఁ డే
దేనియుఁ జూడఁడా! యతని కిట్లని పల్కె వినమ్ర దేహుఁడై. ౯౬

అన్నా, మొన్నటిదాఁకఁ గౌరవులు దౌష్ట్యం బెంతఁగాఁ జేసిరో
కన్నారం బరికించి పాండవులనే కాదందువా? వీర లె
న్నెన్నో బన్నము లొంది నట్టడవిలో నిన్నాళ్లు కారాకులే
యన్నంబై దురవస్థ లోర్చి తుది కీ యత్నంబు గావింపరే. ౯౭

పనివడి యుద్ధమున్ బొసఁగుపాటుగఁ జేయుట తప్పె; కాని త
ప్పనిసరియైననాఁడు వెనుఁబాటుగ నుండుట గొప్పతప్పు; కా
వునఁ దగుశక్తి గూర్చుకొని పూర్వులు వోయిన త్రోవ ధర్మరా
జును నడపించి రిట్టు లనుజుల్; మఱి-వీరికి దోస మంటునా? ౯౮

యుద్ధములో జయాపజయయుక్తు లొకేవిధమైన సూత్రమే
బుద్ధికి నేర్పు; వట్టివి సమూలముగా గుఱుతించి దోష సం
బద్ధము గానియట్టులు ప్రవర్తనముం బొనరించి యిష్ట సం
సిద్ధిని బొంది శ్రేయములచేఁ బెనుపొందఁగఁబోలు ధాత్రిలో. ౯౯

కాని, పరిస్థితుల్ తనకుఁగాక-ఫలింపనినాఁడు న్యాయమున్
బూనుట న్యాయమా? యిది యపూర్వము కాదు మహాత్మ, కౌరవుల్
జేనెఁడు బిడ్డఁ బట్టుకొని చిక్కులు పెట్టిననాఁడు న్యాయ మే
దేనియు నున్నదా? యొకని యిష్టము రెండవవానికష్టమే. ౧౦౦

వీఁడొక తీర్పు సెప్పెడి వివేకియె! వీఁడు ప్రభుత్వయంత్రమున్
బాడొనరించి రాజ్యపరిపాలనమున్ వికలంబు చేసె నె
వ్వాఁడును వీని చేఁతలను భావ్యములంచుఁ దలంపఁ డందుచే
నేఁ డిటు దుష్టశిక్షణము నే నొనరించితి సంతసింపవా! ౧౦౧

నా విని వాఁడు తమ్ముని మనంబున దూఱియు వారిపట్ల స
ద్భావము చూపఁ జాలక యపారవిషాదపరీతచిత్తుఁడై
త్రోవను బోవు నాకిటులు ధూర్తుల చేఁతలు కానవచ్చె, మా
యావిధి పాండవేయుల జయంబును వ్రాసెనె! యంచుఁ బోయినన్.

పదపడి ధర్మరాజు తన 'బాధ్యత' తీఱెనదంచు రాజ్యమున్
బదిలము సేయఁగాఁదగిన భారము పూనఁదలంచి కృష్ణుతో
నది యెఱిఁగింప, వాఁడు పరిహాసముగాఁ గురురాజుఁ జూచినన్
గదఁ గొని నేలఁ గూలియుఁ బగన్ వగఁ గూరియు నాతఁ డిట్లనెన్.

ఓరీ! కంసునిదాసునాత్మజుఁడ వోహో! చాలు - నీ తండ్రి చా
లే రావచ్చును; నీకు - దాస్యమున కేదే లంకె ముప్పేటదై
పోరా! యుండఁగవచ్చు; నీవొక మహాభూపాలమూర్ధన్య వి
స్ఫారాత్మీయపదాబ్జ సన్నిధిఁ గథల్ సాగింపఁగా నేర్తువా! ౧౦౪

చదివితి, వేదశాస్త్రముల సార మెఱింగితి సర్వభోగముల్
కుదురుగఁ జుట్టితిన్ వలయు కోరిక లేవియు నాకు లేవు; పెం
పొదవఁగ నూర్ధ్వలోకముల నుయ్యాలలూఁగెద; క్షత్రియాత్మ కె
య్యది తగు దానినే పడయ నర్హతఁ గంటిని బేరు వొందితిన్. ౧౦౫

ఇఁకఁ బ్రజ లెల్లఁ జచ్చిన మహీవలయంబును రక్తసిక్తమున్
సుకముగ నేలనిమ్ము తన చుట్టము పక్కములెల్లఁ గొల్వ నె
న్నికఁ గొని, రాచపీనుఁగుల నిత్యవిధుల్ సమకూర్చి రౌరవా
దికములఁ ద్రోసి, యేలుబడి తెన్నును వీరికి నేర్పుకొందువో? ౧౦౬

కౌరవ పాండవుల్ పెనఁగి కయ్యము సేయుట కీవె కారణం
బోరి దురాత్మ! నీ కడుపు నుబ్బును దీఱెర! నీదువంశ మీ
తీరుగ నాశనంబయి పతిం బెడఁబాసిన పత్నిఁబోలె సీ
త్కారము లొందుఁ; బాండవులు కారపరాధులు; వారు శుంఠలే.

వెనుకటి గాథలన్ మఱల వెట్టిగఁ ద్రవ్వనుగాని యొక్క మా
టను వినిపింతు నీవు కడు టక్కరివై గురు భీష్ముఁ గర్ణ శ
ల్యుని బరిమార్పఁజేసితివి; యుద్ధములోఁ దుదిఘట్ట మున్న దిం
కను బహుశోచనీయమయి కన్పడు; దానిని గాచుకొందువా!! ౧౦౮

అని పలుకంగ నవ్వుకొని యప్పుడు కృష్ణుఁడు వేచియున్న వా
రిని దనవెంట వైచికొని క్రీడియుఁ దానును జేయిచేయి ప
ట్టును బచరించి దర్పము కడుంగడుఁ జూపుచుఁ బోయి నాఁటిరే
యిని గడుపంగసాగె నిఁక నిక్కడ యుద్ధములోన ద్రోణియున్. ౧౦౯

విన్నఁదనంబుచేఁ దన వివేకము సత్వము రూపుమాయ న
భ్యున్నతిఁ గోలుపోయి యెద నున్న విచారముఁ బెంచి ధార్తరా
ష్ట్రోన్నతికన్నఁ గన్నపిత నొక్కఁడు చంపునె యన్నమాట కే
ఖిన్నత తోఁచి యూసు గొని కేలఁ గుఠారము పూని పైనమై. ౧౧౦

మామను దోడు గైకొని యమాంతము పాండవసేన యున్న యా
గీమును జొచ్చి యచ్చట నొగిన్ నిదురించెడి ద్రౌపదేయులన్
దామస మెక్కి ముక్కలుగఁ దత్ క్షణమే యొనరించి వారికిన్
మామను దోడుచేసె నిది మంచిదొ చెడ్డదొ వానికే తగున్! ౧౧౧

అసలే కోఁతి; 'హుషారు'కోసమయి మద్యం బింత ద్రావంగఁ దే
లు శిరస్సునన్ దెగఁగుట్టెఁ; బైగ మతికిన్ లోపంబు సంధిల్లి వె
ఱ్ఱి సివాలెత్తె; విశేషముల్ సరిగ నీ రీతిన్ జనింపంగ నా
కొసకున్ దయ్యము పట్టె; నిట్టులె మహాక్రోధాత్ముఁడై ద్రోణియుఁ.

పసపస పర్వులెత్తి పసిపాపల కుత్తుక లుత్తరించి దు
ర్యశమును మాటఁగట్టి తన రాజున కీ ఘనకార్య మప్పుడే
మసలక చెప్పి యావలఁ బ్రమాదము కల్గునటంచుఁ దోఁచి బు
ద్ధి సరిగ లేక యాశ్రమము తెన్నులు పట్టె మహాదురాత్ముఁడై. ౧౧౩

అర్ధమరేయిఁ జొచ్చి యటు లందఱు నిద్దురవోవువేళ నా
బుద్ధివిహీనుఁ డాపనికిఁ బూనుట యోఁడుతనంబె; దీనిలో
యుద్ధముమాట దూర్చి యొక యుక్తిని జూపిరి కొంద; ఱైన-వాఁ
డిద్ధర నీచకృత్యమునకే యొడిఁగట్టిన యాతతాయి యగా. ౧౧౪

నిజముగ ద్రోణుఁ డట్లు మరణించుట కప్పుడు ధర్మరాజె య
క్కజమగు కారణం బదియుఁ గానఁడు ద్రౌణి - వివేకి యెట్లగున్ ?
విజయుఁడు బిడ్డచావు విని వేఱుగఁ జంపినవారలున్న - నా
'యజ' గుఱుతించి సైంధవుని ప్రాణము తీయఁడె ద్రోణుసన్నిధిన్.

పలపల తెల్లవాఱఁ బసిపాపలఁ గోసినవార్త యూరిలో
పలఁ గడుఁ బొక్కిపోయెఁ; దమ వంతగునంచు నెఱింగి కృష్ణుఁ డ
వ్వల నొకచోటఁ జేరెనఁట; పాపము! పాండవపుత్త్రు లిట్లు కాఁ
గలరనికూడ వాఁ డెఱిఁగి కైకొనఁడాయెను శ్రద్ధ బొత్తిగా. ౧౧౬

తన మేనల్లుఁడు పోవ, ద్రౌపదిసుతుల్ ధాత్రీతలం బేలు వా
రని లోలోపలఁ బొక్కి కృష్ణుఁ డిటు లావంతైన జోక్యంబు గై
కొనఁ; డీ రీతి హిడింబపుత్త్రు నితఁడే కూల్చెన్ మహాయుద్ధమం
దును దోడీయక; కాని పాండవులకున్ దోడీతఁడే యన్నిటన్. ౧౧౭

ఈతని తోడులేక యొక యీఁగనుసైత మదల్ప వారికిన్
జేతులురావు; పాండవుల చేఁతల కన్నిటి కాదికారణం
బీతఁడె; వీని యండఁగొని యెన్నివిధాల మెలంగ మార్గముల్
చూతురొ పాండవుల్ కథలు చూచిన స్పష్టముకాదె సర్వమున్.

నిన్న నె కౌరవేశ్వరుని నేర్పుగఁ గూల్చియు రాజ్యకాంక్షచే
మిన్నును మన్నుఁ గానక తమిం జనుదెంచిన ధర్మరాజు రే
యి న్నిదురించి ఱేపకడ నిట్టి భయంకరవార్త వీనులన్
విన్న మఱుక్షణంబె పలవించుచు మూర్ఛ మునింగె నక్కటా! ౧౧౯

అంతిపురంబులో యువతు లందఱు గొల్లున నార్తనాద మ
త్యంతము చేయఁగాఁ దొడఁగి రప్పుడు-ద్రౌపది గర్భశోక మిం
తింతని యాదిశేషునకునేనియుఁ జెప్పఁగ రాదు; కృష్ణు వే
దాంతముమాత్ర మంత నిసుమంత ఫలించె మహావిపత్తులో. ౧౨౦

భీముని క్రోధవహ్ని ప్రభవించి వియత్తల మంటి శాత్రవ
స్తోమము నామరూపములతోఁ దుమమాడఁగఁ జూచె; నంత ను
ద్దామపరాక్రమాఢ్యుఁడు పృథాసుతమధ్యముఁ డా యవస్థ యే
మేమిగ మాఱునో! తమ కనిష్టము కల్గునో! యంచు నెంచినన్. ౧౨౧

వారల నెల్లరన్ దన ప్రభావముచే నొక యొడ్డు నేర్చి దు
ర్వారపరాక్రమైకధనుఁ బార్థుని భీముని జీరి కృష్ణుఁ డీ
ఘోరదురంతకృత్యమునకున్ దలపడ్డ మహాపరాధు నా
భీరువు ద్రౌణి దుర్మతిని బేఁచ మణంపఁగ నెంచి యిట్లనెన్. ౧౨౨

వినరయ్యా, యధమాధముం డతఁడు-తద్విజ్ఞాన మూహింపఁగాఁ
బని లే దాతఁడు వట్టి శుంఠ; మన కీ ప్రారబ్ధముం గూర్చె, వా
నిని మీ రిర్వురు పట్టి తేవలయు నా నీచున్ మహాశిక్ష వే
సిన దోసంబులు వీడిపోవుఁ గనుకన్ శీఘ్రంబుగాఁ బోవరా!! ౧౨౩

నా విని కోపతాపము మనంబున రేకొన నన్నదమ్ము లెం
తే వడిఁ బోవనేర్చు రథ మెక్కి మహాజవసత్త్వమూర్తులై
పోవను బోవ నొక్క మునిపుంగవునాశ్రమభూమియందు నా
కావలు ద్రౌణిఁ జూచి భయకంపితు వానిని బట్టి గట్టిగా. ౧౨౪

త్రాటను గట్టి పైగ నరదంబునఁ గంబము నంటఁగట్టి మో
మోటమి లేక యిర్వురు సహోదరు లాతనిఁదెచ్చి చూప నా
రాటముతోడ ద్రౌపది పరాక్రమవంతుల భీమపార్థులన్
మాటల మెచ్చి, జాలి పొడమంగ మహాంగన గాన నిట్లనెన్. ౧౨౫

వీఁడొక మూర్ఖుఁడై తన వివేకము దవ్వుల నెట్టి కయ్యమే
చూడని బిడ్డ లందఱ'నుసూరు'మనంగను బొట్టఁ బెట్టుకొ
న్నాఁడని నే నెఱింగియు మనంబునఁ గల్గిన జాలివల్ల నే
వేఁడెద మిమ్ముఁ ద్రాటవిడిపింపరె! పాపము పండె వీనికిన్. ౧౨౬

తల్లికి నీతఁ డొక్కఁడె ముదంబును గూర్చెడి బిడ్డ-ఆ పయిన్
బల్లిదుఁడైన వల్లభుఁడు భండనమందు గతించె, నందుచేఁ
దల్లడ మంది యింటఁ బడి దారియుఁ దెన్నును లేక దుర్గతిం
బెల్లుగ స్రుక్కు యేమగునొ! వృద్ధను బెద్దలనుగ్రహింపరే! !౧౨౭

తుంటరిమాట కాదనను ధూర్తుని వీని క్షమింపరాదు నా
వంటి యభాగ్య యొక్కతె దివానిశ మాఱడి చెందునట్లు మీ
వంటి వివేకు లెన్నఁ డశుభంబులు సేయఁగరాదు కాన ని
ట్లుంటిని; వీని కేదయిన యర్హవిధంబుగ శిక్ష వేయరే!! ౧౨౮

గురుని మనంబులోఁ దలఁచి కొందల మందు కిరీటి-ద్రౌణి దు
శ్చరితముమాట యెత్తినఁ బ్రచండ తరంబుగ మండిపోయి, దు
ర్భరమగు శోక మంది వెనుఁబాటుగఁ బల్కెడి భార్యమాట క
చ్చెరువును జొచ్చి యేదియును జేయక తోఁపక యుండె నచ్చటన్.

అంతట వాసుదేవుఁ డది యంతయుఁ జక్కఁగఁ జూచి కార్యమున్
'సంతన' సేయఁగాఁ దలఁచి చయ్యన ద్రౌణికి నున్న బంధముల్
సాంతము నూడఁదీసి 'గ్రహచార' మటంచుఁ దదీయ మూర్ధమం
దెంతయు రాణసెంది నుతి కెక్కిన రత్నము లాగివైచినన్. ౧౩౦

కోఁతులు దుల్లు ద్రాఁచువలెఁ గొండెము ద్రుంచిన తేలువోలె దు
ర్వార పరాక్రమాఢ్యుఁడగు పాండుసు తేజము తగ్గి గుండెలో
నాఁటని శోకవహ్ని తను వంతయు మంటలు రేఁపి తాప మ
వ్వారిగఁ గూర్ప నేమియును బల్కక మూఁగగ నుండె నొంటిమై.

పగ యడఁగంగఁ-బ్రాణములు పాయనియట్టులు ద్రౌణి కంత నె
వ్వగ మితిమీరఁ గూర్చి, యిఁక బాఁపఁడ, లోకమునందుఁబిచ్చి కేఁ
గఁగఁ జెలరేఁగఁబోకు మిది గాదు వివేకిజనంబు త్రోవ; నీ
మొగమును జూడఁ బాపములు పుట్టును బొమ్మని యీసడించినన్.

ఎడపెడ దగ్ధచిత్తుఁ డయి యేమియు నోరు మెదల్పలేక వం
చెడి తల యెత్తలేక — తల చెడ్డ యనాథయుఁబోలె మెల్లగా
నడుగులు వైచి తోఁచినటు లా విపినంబును జేరి యంత నా
తఁడు తన కచ్చ తీఱ బహుధా పరిశీలన చేసె నయ్యెడన్. ౧౩౩

తన కొకనాఁడు తండ్రి ప్రమదంబున నేర్పిన యస్త్ర మొండు త
ప్పనియపు డిమ్ముగాఁ బరులపైనిఁ బ్రయోగము చేయఁదగ్గదా
నిని దరుణం బిదే యనుచు నీచుఁడు మంత్రము నుచ్చరించి వే
సెను గుఱిచూచి యుత్తరకుఁ జిత్తము తత్తఱ మంద నత్తఱిన్. ౧౩౪

అంతకు ముందు వంశమున కక్కఱవచ్చెడి గర్భ మున్నదం
చంతిపురంబులోఁ దెలిసి యందఱు సంతస మంద నిట్టి వృ
త్తాంత మెఱింగి ధూర్తుఁడగు ద్రౌణియు నీ పని చేసె; వాఁడు కా
లాంతకుఁడే సుమా! శిశువులన్నను వాఁ డిటు చీల్చివైచునా! ౧౩౫

ఇది యొక స్వామిభక్తి యగునేమొ తలంపఁగఁ గౌరవేశ్వరుం
డిది విని యాత్మశాంతిని వహించునటం చతఁ డెంచెనేమొ! త
ప్పిది యని యాతఁ డెన్నఁడు; మహీసురవంశములోన పుట్టి యి
ట్టిది యెవఁడేని చేసెనె! యహా! యితఁ డెంతటి మూర్ఖుఁడో గదా!

అచ్చట గర్భ మట్టిసమయంబున స్వాస్థ్యము దక్కె; నొక్కనాఁ
'డచ్చట ముచ్చటన్' జరుపు నంతిపురంబునఁ గొంత-కన్న దా
చచ్చినబిడ్డ నొక్కని, విచారము దందడి పిచ్చటిల్లి పై
నచ్చెరు వంది యెల్ల రకటా! యని గొల్లున నేడ్చి రత్తఱిన్. ౧౩౭

అత్తలు పైగ ముత్తవలు నందఱు పెల్లుగ డిల్లవోయి యా
పత్తున కేది మందని యపారవిషాదముతోడఁ గృష్ణునిం
బత్తిగ వేఁడి నెత్తిఁదెగ బాఁదుకొనంగ నతండు సర్వముం
జిత్తమునం దెఱింగి తగుచేఁతలు చేసినఁ గొంత శాంతియై. ౧౩౮

కదలని బాలుఁ డాపయి వికాసము కల్గియు నేడ్వఁగాఁ బదిం
బదిగ బరీక్ష చేసిరఁట పాపము! కావునఁ బేరు వానికిం
గుదిరెఁ బరీక్షితుండనుచుఁ గ్రూరుఁడు ద్రోణి యొనర్చియున్న యా
పద యిటు తీఱ నెల్లరును బ్రస్తుతి చేసిరి కృష్ణమూర్తినిన్. ౧౩౯

కౌరవపక్షమం దరయఁగా నొక మువ్వురో నల్వురో-మహా
శూరులు సేయు యుద్ధమునఁ జొచ్చియుఁ జావరు; వారిలోన నీ
భీరువు ద్రోణి యొక్కరుఁడు వీనికిఁ బ్రాణము లున్నవందు రె
వ్వారును గారవింపని యవస్థయె మూఁడెను బాపిజీవికిన్. ౧౪౦

మఱి యొకఁ డా యుయుత్సుఁ డను మానిసి ; యాతని తల్లి వైశ్య;సో
దరులగు కౌరవుల్ సమరధాత్రిని జేరిననాఁడు భీరువై
చెరచెరఁ బాఱి పాండవుల సేనను జొచ్చెను గాన వాని బి
త్తర యడగంగఁ జేసి వసుధన్ బ్రతికించిరి పంచపాండవుల్. ౧౪౧

ఇట్టులు కౌరవేశ్వరుని యెల్లబలంగము యుద్ధభూమిలో
గిట్టెను ; దల్లిదండ్రులకు గేహములో నొకఁడేని పట్టి క
న్పట్టఁడు చేతి కూఁతమయి, పాపము ! వారొక జీవిమాత్రులై
నెట్టిరి కాలమున్ బిదప నెవ్వగ బిట్టుగ నిల్వటిల్లఁగా. ౧౪౨

ఐనను పాండవుల్ గొనిన దంతయు లాభమె! దానిలోనఁ గ
ల్గినది పెచ్చు; నిల్చినది యక్కట తీర్చుటలోన లొచ్చె-యే
మైనను రాజ్యముం దొరకె-నంతియె చాలని సంతసించిరే
గాని యదేవొ చిక్కులు సుఖంబుగ వారల నుండనిచ్చెనా!! ౧౪౩

వరుసగ రాచపీనుఁగుల బంతులు దీరిచి కర్మకాండముల్
జరుపఁగఁజొచ్చు ధర్మజుని జప్పున నాఁపిరి పెద్ద లెవ్వరో
యరయుము వీఁడు కర్ణుఁ డితఁ డగ్రజుఁడే యగు నీకు నంచు న
చ్చెరువు నభూతపూర్వమగుసృష్టిగఁ బల్కుచుఁ బాప మయ్యెడన్.

నమ్మఁగ నేరఁ డయ్యె నరనాథుఁడు లీలగనైన, నెవ్వరే
నిమ్మగఁ జెప్పియుండనిది యెన్నఁడు తల్లియు మాటమాత్రమున్
దమ్ములటంచుఁ జెప్పనిది దారుణమైన యుదంత మిట్టి క
ర్మమ్మునఁ గూడెనా యనుచు మానవుఁడంతట మూర్ఛవోయినన్.

మఱియొక పీనుఁగిట్టులు ప్రమాదము తెచ్చునె యంచు నెంచి త
త్క్షణమున వారు వీరును ప్రధానముగాఁ బరిచర్య చేసి యు
త్తఱి బ్రదికించి రాతనిని; దత్క్షణ మాతఁడు సేద దేఱి కా
తరహృదయంబుతో నపుడు తల్లిని గుంతిని బిల్వనంపఁగా. ౧౪౬

కొంగున నగ్ని దాఁచికొను గొంతియు నంతట వచ్చి బిడ్డ కా
సంగతి చెప్పఁ గోపపడి చట్టున శాప మొసంగె స్త్రీల కి
బ్భంగి రహస్య మింకఁ దలఁపన్ భువి నిల్వదటంచు - దానిచే
నంగన యెట్టి గుట్టు తన యంకిట దాఁపదటందు రెందఱో!! ౧౪౭

చిన్నతనంబులో నతనిచేష్టలు కన్నులఁ గట్టినట్టుగా
నున్నవి వాని నెట్టు లిఁక నోర్చి స్మరింపకయుందు; నాకు వాఁ
డన్నయె కాన యుద్ధసమయంబున జాలి వహించి యప్పుడే
మన్నను నన్ను సైఁచుటయు నక్కట! జ్ఞప్తికివచ్చు నేఁటికిన్. ౧౪౮

ఒక్కొకనాఁడు వాని మొగ మొప్పిదమై మముఁ గన్నతల్లిలోఁ
జక్కఁదనంబు తెచ్చుకొను చందము నాకు స్ఫురించుచుండు; మే
మక్కట! వాని తమ్ములని యాతఁ డెఱింగియె యుండు, దానిచేఁ
జిక్కిన మమ్ము యుద్ధమునఁ జీల్పకయుండెడివాఁడు జాలిచే. ౧౪౯

కేవల సూతపుత్త్రుఁడని క్రించఁదనంబున భీమసేనుఁ డా
పై విషయం బెఱుంగక 'యభంబు' శుభంబును జూడ కాతనిన్
భావములోఁ 'నసహ్య'పడి ప్రల్లదనంబునఁ బల్కు మాట లే
నే విధి బొత్తిగా మఱతు నీ విషమస్థితి కేది మూలమో! ౧౫౦

మొగమునఁ దేజ ముట్టిపడి మూఁడు జగమ్ముల నేలఁజాలు న
మ్మగతన మున్న యాతని నమాయికలోకము సూతజన్ముఁగాఁ
దెగడుచునుండ నాతఁడు మదిం గుఱుతించియుఁ బల్కఁడయ్యె నెం
త గడుసువాఁడొ! వానికి విధాత యి దేలకొ చేసె నిట్టులన్! ౧౫౧

ఆతఁడు మాకు నగ్రజుఁడె యాట యెఱింగిన మేము యుద్ధమున్
జూతుమె! వాని యండయును జూచియె కౌరవరాజు - కౌరవ
వ్రాతము పొంగిపోయి రణరంగములన్నను సాగరంబులో
నేతము వైచునట్టు లెదురీఁదెడునట్టుల నుందు రెప్పుడున్. ౧౫౨

ఓయీ కృష్ణ, మహానుభావ, యతఁ డేదో గొప్ప క్లిష్టస్థితిన్
జేయూఁతం బొకయింత లేనితఱిఁ దచ్ఛ్రీయంబుఁ గాంక్షించె నా
మాయాబుద్ధి సుయోధనుం డనుచుఁ దన్మానంబు గాపాడు టే
ధ్యేయంబన్నటు లెంచె; నాతఁ డెవఁడో దిఙ్మాత్రమున్ జెప్పితే!! ౧౫౩

ఆపదలందుఁ దేపవయి యాప్తశరణ్య, సమస్తసౌఖ్యముల్
చూపఁగ నీవె దైవమని చూవె తలంచియు నిన్నినాళ్ళు మే
మోపిక సూపి బన్నముల నోర్చితి; మిట్టిది కర్ణుజాడలో
లోపము నేల చేసితి వలోకమహామహితాత్మ, చెప్పవే!! ౧౫౪

కంచెయె చేనుమేయ నిఁకఁ గాఁపున కెవ్వరో దిక్కుమ్రొక్కు! మా
మంచిని జూచు తల్లియును మాధవ, నీవును గర్ణుఁగూర్చి యి
ట్లెంచితి రేల! వాని నటు లేవురమున్ బరిమార్చి నెత్తుటిన్
బంచుకొనంగఁ జూడ నిది భావ్యము కాదని చెప్పియుంటిరా!! ౧౫౫

ఎవరో లాఁతులు కన్నబిడ్డ తమ కేదేఁ గూర్చునం చెంచి, యే
యవరోధంబును లేక పెంచి రతనిన్ వ్యామోహముం బొంది, నీ
కెవ రీ పద్ధతి నేర్పిరమ్మ, మదిలో నే మాత్రమున్ బ్రేమ చూ
పవు నీ తత్త్వము నే మెఱుంగ మిఁక మా ప్రారబ్ధ మిట్లయ్యెనా!! ౧౫౬

ఆ నాఁడా ద్రుపదావనీపతి మహాయాగంబుగాఁ జేయు క
ల్యాణంబందలి మత్స్యయంత్ర మతఁ డేయన్ రాఁగ-సూతుం డవీఁ
డే నా భర్త యటన్న దోసమని యెంతే ద్రౌపదీకన్య య
వ్వానిన్ గూర్చి వచించె; నిట్టితఁడేఁ దత్యాంతం బదెట్లాయెనో!! ౧౫౭

చిన్నతనంబులో నొకరిచేతికిఁ జిక్కిన కర్ణుఁ డెన్నియో
బన్నము లంది కౌరవుల భారము నెత్తిని దాను బూని య
భ్యున్నతి పొందు దృశ్యము తదూర్జితకీర్తియు నీ మనంబులో
మన్నన సూపవా? ప్రియకుమారుని బొట్టను బెట్టుకొంటివా! ౧౫౮

గురువుల బంధుమిత్రులను గూల్చితి రాజ్యముకోస మన్యభూ
వరులను మృత్యుదేవతకు భక్ష్యము చేసితి, రాజ్యకాంక్ష తీ
వరమయి యిట్టి చెయ్దములఁ బాపము పున్నెము సూడ కిట్టి సో
దరు బలియిచ్చితిన్ దుదికి దైవము నా కెటు శిక్ష వేయునో!! ౧౫౯

అతఁడే యన్నని యెవ్వరన్నను మనం బల్లాడి యీ ఘోరచే
ష్టితముల్ చేసెడివాఁడనా! యకట! నా చిత్తంబులో నిట్లు సం
తతమున్ జిచ్చు రగుల్పఁగాఁ దొడఁగు నా తల్లిన్ మహాభక్తిఁ జూ
చితి నిన్నాళ్లును, నాదుజీవితము ఛీఛీయంచు నిందింపరే!! ౧౬౦

కోరిన కోర్కులా తుదికిఁ గొండను ద్రవ్వినయట్టు చిత్తమున్
గాఱియ పెట్టఁగాఁ దోడఁగె; గర్మము నా కిటు వ్రాసియుండ నే
తీరుగ రాజ్యభారము మతి స్తిమితంబుగఁ బూని లెస్సగా
ధారుణి నేలఁగాఁగల విధానము దక్కునో! చూడఁగావలెన్. ౧౬౧

లాభము లేదు; నా కిపు డిలాతల మక్కఱలేదు, భీముఁడే
వైభవ మొప్ప రాజ్యపరిపాలన సేయును; నా యెడందలో
లోభ మనంతమై మనుజలోకము దూఱెడి త్రోవ ద్రొక్కి నే
నీ భువి నిందపాలయితి నెందుల కింక మదీయ జన్మమున్? ౧౬౨

అని యా ధర్మజుఁ డా విచార మధికంబై యేమియుం దోఁచి తోఁ
పని యారాటముతో నిరీహమతియై ప్రారబ్ధముంగూర్చి ప
ల్కినఁ గృష్ణుం డది లెస్సగా నరసి తత్ క్షేమంబు గావించు త్రో
వను జూపెం దగ నశ్వమేధ మదియే ప్రారంభమై సాగినన్. ౧౬౩

ఇంతకు మున్ను ఘోరముగ నెందఱనో పరిమార్చి దేశమం
దంతట వల్లకాఁటి కెనయైన పరిస్థితిఁ గూర్చి పాండవుల్
సంతస మంది యాగమును సల్పఁగఁ జొచ్చిరి దానఁ జేసి య
త్యంతము నీరసించెఁ బ్రజ యంతయు దుర్భరమైన లేమిడిన్. ౧౬౪

దేశము నాల్గు మూలలు పదింబదిగా నెసరేఁగు క్షామమున్
గాసి యొనర్ప దిక్కుదెస గానక వందురి క్రింద మీఁదుగా
నైసగమై విశేషముగ నార్తిని జెందిన నార్చి తీర్చి యా
యాసము తీర్పఁగాఁగలుగు నట్టిఁడు లేఁడొకఁడైన నత్తఱిన్. ౧౬౫

ఎలుకకుఁ బ్రాణసంకట మదే సమయంబునఁ బిల్లివైభం
బులు పెనుపొందునట్టు లిఁక భూమిని సర్వము నేలఁ బాండవుల్
దలపడి యాగశాలలు ముదంబునఁ గట్టిరి వన్నెచిన్నెలన్
మెలఁగిరి; కాని దేశమును మ్రింగెను గాటక మెల్లచోటులన్. ౧౬౬

సరి ! యెట్లో తమవైభవంబు లధికోత్సాహంబుతోఁ బూర్తి చే
సిరి యా పాండవు లంతఁ గృష్ణుఁ డిఁక నే శేషంబు లేకుండఁ జె
చ్చెర సర్వం బొనఁగూర్చి సంతసముతోఁ జేరె న్నిజద్వారకా
పురి కాత్మీయు లశేషభక్తి వినయంబుల్ చూపి 'జే' కొట్టఁగా. ౧౬౭

అయ్యెడ బిడ్డ వచ్చెనని యా వసుదేవుఁడు సంతసించి యే
మయ్య ! విశేషవార్తలని యాత్రముగా నడుగన్ గ్రమంబుగా
నయ్యయివార్త లంత వినయంబునఁ జెప్పుచు మాటవెంబడిన్
జయ్యనఁ దేల్చె నుత్తర విచారముసంగతి యెల్ల నత్తఱిన్. ౧౬౮

ముదుసలి గుండె బ్రద్దలయిపోవఁగ దారుణవార్త యిట్టి దా
యదనునఁ జెప్పి కృష్ణుఁ డది యంతయు దైవవిలాసమంచు నె
మ్మది గుఱుతింపఁజేసి తన మాటకు మన్నన సూపి ప్రేముడిన్
బొదలెడి ద్వారకాప్రజలఁ బ్రోచెను గొన్ని దినమ్ము లిమ్ముగా. ౧౬౯

వెనుకటి సంప్రదాయములు భిన్నపరిస్థితి నొంది ద్వారకన్
గనుపడసాగె; యౌవనవికారము స్వైరవిహార మెల్లెడన్
బనుపడి మంచిచెడ్డల విభాగము లేశము లేదు; పైగ నె
వ్వనికిని రాజశాసనము పద్ధతియే రుచియింప దయ్యెడిన్. ౧౭౦

ఇది ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము

## యా ద వ ము స ల ము

ద్వారకలోనివారలు వృథాకలహంబులు పెచ్చురేఁగి యె
వ్వారికి వారె వర్గమయి వంతులు గంతులు వేయఁజొచ్చి, రం
దేరును మంచిసెబ్బరల నిట్లని యట్లని చూపి చెప్పఁగాఁ
బోరు; వినాశకాలమున బుద్ధులు మాఱు నటంద్రు పెద్దలున్. ౧

మదిరాపానము సర్వమానవులలో మర్యాదగా సాగి నె
మ్మదిగా సుస్థిరమయ్యె, దాని నెవఁడున్ మాన్పింపఁగాఁ జూడఁడొ
క్క దినంబందు సమస్తయాదవులు మూఁకల్ గట్టి సంద్రంబు స
న్నిధిలోఁ గాలముపుచ్చఁగాఁదొడఁగి; రా నిర్భాగ్యులొక్కొక్కఁడే. ౨

తెగఁద్రావన్ మతి వోయి యొండొరులతోఁదిండ్రించిగాండ్రించి పె
ద్దగఁ గోలాహల ముద్భవింప భువిలోఁ దామే మహాశూరుల
ట్లాగి నార్భాటము చేసి రోషమున నేవో కూఁత లూఁకొట్ట వే
ఱుగ నెవ్వారలు లేకయే పలికి మాఱ్మ్రోతల్ కడున్ జేయఁగా. 3

ఎవఁడో యొక్కఁడు వాద మందుకొని యేవేవో మహాధర్మవా
క్యవిచారంబుల జోలి యెత్త - నది వాగాడంబరంబంచుఁ బా
ర్థివలోకంబున కేవ గల్గు సరణిన్ 'చీర్మానముం' జేయఁ బ్రా
భవమున్ జూపు మఱొక్కఁ డిట్టు లధిక ప్రస్తావముల్ సాగఁగా. ౪

పాండవు లేవురున్ దమ కపాయము పాయుట కే యుపాయముల్
భండన భూమిలో వెదకి పల్మఱు మోసముసేయ సిద్ధమై
యుండిరొ - యట్టి సర్వకథ లున్నవి లేనివి వాడు వీడు తా
మొండొరు లూఁకదంపుకుఁగ నూఱక వాఁగిరి కాకిమూఁకలై. ౫

త్రాగినవారి కూఁతలకుఁ ద్రాఁడును బొంగర మేదిగాని యే
లాగున నుండు? యాదవుల లావున కయ్యది తోడు కాఁగ నే
దో గుఱి చూచి యొక్కని మఱొక్కఁడు వేయఁగ గ్రుద్దులాటలో
సాగిన వేఁట శాంతమును జంపి తుదిన్ రసభంగ మిచ్చినన్. ౬

యాదవులెల్ల రక్తఱి నయాచితయుద్ధములోన నొండొరుల్
బాఁదుకొనంగఁ బెక్కురకుఁ బ్రాణము లట్టె గతించె, నంతలో
నేదియుఁ దోఁప కచ్యుతుఁ డదేమని యెవ్వరి నొక్కమాటయున్
గాదనలేక యొంటరిగఁ గాననసీమకుఁ బోయె నెవ్వగన్. ౭

బలదేవుం డొకప్రక్క నిక్కథలలోఁ బ్రాముఖ్య మెంతెంతగాఁ
గలదో లెస్సగ గుర్తెఱింగి తనకున్ గాలంబు దాపైనయ
ట్టులు భావించియు నిర్విచారముగ నాటుంబోటులున్ లేక తా
నిలలోఁ బూనిన జీవయాత్ర యిఁక నాకేలంచుఁ జాలించినన్. ౮

క్రమముగ సాగు నీ 'మరణకాండము' సర్వమెఱింగి కృష్ణుఁ డా
సమయములోన పాండవుల సన్నిధి కొక్కనిఁ బంచి యీ విశే
షము కబురంపి ప్రాణములు చయ్యనఁ బాసెను; గాల మిట్టి తం
త్రము పచరింపఁ గాదని యదల్చెడి వ్యక్తియు లేఁడు భూమిలో. ౯

శరవేగంబున హస్తినాపురికి నీ సర్వంబు ఘోరంబుగా
నరుదేరన్ విని ధర్మరాజు - మదిలో నాశ్చర్యవైక్లబ్య దు
ర్భరసంతాపము లొక్కపెట్టఁ గదురన్ రావించి తమ్మున్ సరా
సరిగాఁ బంపెను ద్వారకాపురికి నా శౌరిన్ సమీపింపఁగా. ౧౦

అన్న యనుజ్ఞ గైకొని మహామహుఁ డర్జునుఁ డంత ద్వారకన్
గన్న శ్మశానవైఖరిగఁ గన్పడ విహ్వలచిత్తుఁడై మహా
పన్నశరణ్యుఁ గృష్ణ-బలభద్రుని జూపెడివారు లేక తా
నెన్నఁడు గాంచనట్టి యతిహీనపరిస్థితి నొంది కుందినన్. ౧౧

అనుకోనట్టి దురంతదుర్భరమహా 'ప్రారబ్ధకర్మంబు' కృ
ష్ణుని కే మూఁడుట కేమి కారణమొ! యీ చొప్పుం దగం జెప్ప నె
వ్వనికైనం దరమా? వసుంధరకు దౌర్భాగ్యంబు రానేల? యే
మని వర్ణింతుము! పాతకం బెవనిదో-ఆద్యంతముల్ చూడవా! ౧౨

కౌరవవంశమం దొకఁడుగాని రణంబున శేషభాగముం
జేరినవాఁడు లేఁడు; తనశీలముచే జగ మెల్లఁ బేరు పెం
పోరిమి నొంది మ్రోగిన మహోజ్జ్వల దివ్యచరిత్ర కట్టి గాం
ధారికిఁ బెట్టు బన్నములు తప్పక యిట్టు లొనర్చె శౌరికిన్. ౧౩

కడుపునఁ బుట్టి సంబరముగాఁ జిరకాలము పెంపు నొంది యీ
పుడమికి రాజరాజయిన పుత్త్రుఁడు తమ్ములతోడఁ గాలమున్
గడపుచు సర్వసౌఖ్యములు గల్గియు నట్టి మహారణంబులో
మడిసిన - నట్టి తల్లి మనమందు వ్యథాభర మొందదయ్యెడన్! ౧౪

ఏపు రెట్టైనఁ బాండవుల కేమి భయంబును గల్గనీక మా
యావిగఁ జేరి పాండవజయంబును గోరి రణంబులోన దు
ర్భావము సూపి కౌరవుల వంశము నాశము సేసి కృష్ణుఁ డెం
తో వినయంబుతోఁ బిదప నొయ్యన వచ్చి విచిత్రమూర్తియై. ౧౫

దగ్గఱఁ జేరి కౌరవుల తల్లికి మ్రొక్కి సుయోధనుండె మీ
కిగ్గతిఁ గూర్చెఁ బాండవుల కేమియు హానిఁ దలంపకమ్మ, కాఁ
దగ్గది యైన దింక నిజధర్మ మెఱింగి విచారవృత్తికిన్
మొగ్గక జీవితమ్మునకు మోదము గూర్చెడి త్రోవఁ బోవవా? ౧౬

నావుడు సర్వమున్ దన మనంబున దాఁచి ప్రశాంతబుద్ధికిన్
దావలమైన యామె వసుధాపతి ధర్మజుఁ జేరి కాత్మలో
నే విధమైన యీర్ష్య యొకయింతయు నొందక పల్కెఁ గృష్ణుతో
నో వసుదేవనందన, యహో! గుఱుతించితి నీదు చేష్టలన్. ౧౭

రాజులు మున్ను ఘోరరణరంగములోఁ జతురంగసైన్య వి
భ్రాజితులై సమూలముగఁ బ్రాణము వాయుట విందుమయ్య, ని
ర్వ్యాజకృపాధురీణ, యిటువంటి విషాదపుగాథమాత్ర మె
చ్చో జనియించెనే? తుదికి శోచ్యముగా నిటు సేయఁ బాడియా? ౧౮

నూర్వురు బిడ్డలన్ గని వినూత్నమహావిభవంబు లొంది యీ
యుర్వికిఁ జక్రవర్తి యయి యొప్పిన యీ శతవృద్ధుఁ డక్కటా!
సర్వము దూలి కంటికిని సాయపడంగల బిడ్డలందు నే
పుర్వును లేక జీవితము పుచ్చఁగఁ జేసితివయ్య ధూర్తుఁడా! ౧౯

ఒక్కని శేషముంచిన మహోగ్రపరాక్రమమూర్తి, దుర్దశన్
జిక్కిన మాకుఁ జేతి కొక చిన్ని సహాయము కాఁడె? భూమిలో
నక్కట! యంతమాత్రమునకైనను నోఁచమె? వంశనాశనం
బిక్కరణిన్ బొనర్చి బ్రదికించితి వెందులకయ్య మమ్ములన్!! ౨౦

పోయినవారె ధన్యులని బుద్ధికిఁ దోఁచుచునున్నదయ్య మా
కాయువు పోసి యిట్టు లనయంబు విపద్దశలో మునుంగరా
దా యని యానతిత్తువె మహాత్మ, దయానిధి వందు రేవి నీ
న్యాయము చట్టుబండలయినట్టు కనంబడుచున్న దక్కటా! ౨౧

కొమ్మలు రెమ్మలాకు లనుకోనివిధమ్మున దుల్లి చెల్లు భూ
జమ్ము తెఱంగు నిర్వారము చచ్చినచావయి శుష్కజీవితం
బిమ్మహి నెంతకాల మిటు హీనదశం గడపంగ నేర్చె మా
నమ్ము లవమ్ము లేని 'భరణమ్ము'న నందురి యుందు మక్కటా !! ౨౨

చేసితివయ్య ఘోరమగు చేష్టలు వానిని బేరుపేరునన్
బూసలు గ్రుచ్చినట్లు లనుభూతికి వచ్చినవాని నిట్టివం
చీ సమయానఁ జెప్పుకొన నేరికి లాభము లేదు; సర్వథా
దోసము నీదె కావుటను దూఱకతప్పదు నిన్ను మాధవా! ౨3

నీ వంశంబునవార లిట్టు లెపుడో నిర్భాగ్యులై మూఁకగాఁ
జావంబోవుట నిశ్చయం బిదియ నా శాపంబుగాఁ జూచి నీ
త్రోవన్ బోవు మటన్నఁ గృష్ణుఁడును దద్రోషంబు గుర్తించి య
మ్మా, వాదింపను; బోయివత్తు సెలవిమ్మా యంచు నేఁగెంగదా! ౨౪

ఆ శాపాక్షరముల్ మహోజ్జ్వలములై యాద్యంత ముద్వేగముం
గాసిం బెట్టఁగ యాదవాన్వయ మిటుల్ గారాకులన్ మేసె, స
న్న్యాసుల్ చచ్చిరి; యెవ్వఁడో యొకఁడు తన్నాశంబు లోకాన నే
దో సెప్పంగను శేషముండె; నది యేమో గాని గాండీవియున్. ౨౫

వలవల యేడ్చె యాదవవిపద్దశ కోర్వక; భర్తృహీనతన్
బలపల కంటినీ రురలి పాఱెడి గోపకులాంగనాతతిన్
జలమునఁ జెంచుజాతు లరసంబుగఁ బట్టియు దోఁచుకొంచుఁ జే
తులు పెనవైచి చేఁతలను దుందుడుకున్ బొనరించి రక్కటా! ౨౬

చూచియుఁ జేత గాండివము చొప్పడియున్ బలుకంగలేక యా
నీచుల మందలించి యవినీతిని మాపఁగఁ జేతఁగాక యే
దో చెఱఁబడ్డ దోషివలె నోహట మందియుఁ బార్థుఁ డయ్యెడన్
బీఁచ మడంగి రాపడియు బిట్టుగ నెవ్వగఁగూరె నమ్మెయిన్. ౨౭

అంతలు సేసి సంగరమహార్ణవ మీఁదను దేపయై సమా
క్రాంత సమస్తపార్థివ విరాజితవైభవమైన గాండివం
బింత యగౌరవంబును సహించుట పార్థున కబ్బురంబు న
త్యంత విషాదమున్ గలిగె నక్కట! యెక్కడవోయె శక్తియున్. ౨౮

ఓపిన సత్త్వసారమున నోహరిసాహరిఁ జెంచుమూఁక లా
గోపకులాంగనామణులకున్ దన ప్రోలనె తాళిఁ గట్టెడున్
గోపము వచ్చెఁగాని యనుకూలపరిస్థితి దాఁటిపోయి యెం
తో పరవళ్లు త్రొక్కినపు డొక్కఁడె పార్థుఁడు బిక్కమోముతో. ౨౯

తుది కతఁ డంగనామణుల దుర్భరశోకదవానలంబు బె
ట్టిదమయిపోవ డీల్పడి కడింది విచారము నొందెఁగాని యా
పద మొదలంట నైదొలఁగు పద్ధతి లేశము బుద్ధిలోన తోఁ
పదుగద! కారణం బెవరు పల్కిన కాలమహత్త్వమే యగున్. 30

ఒకనాఁ డాతఁడు సంగరాంగణములో నుద్రిక్తుఁడైయుండ నే
రికిఁగానీ తలయెత్త సాధ్యమయి యీరీతిన్ రసాభాస చే
ష్టకుఁ జోటిచ్చెనె? గాండీవం బితరులన్ శాసింపఁగా నేర్చి నేఁ
టికి నిట్లాయె; నిదేమి కర్మమొ! కిరీటిన్ జుట్టుముట్టెన్ గటా!! 31

తానేమో మొనగాఁడుఁబోలె ధను వుద్యల్లీల సారించి యు
ద్ధానన్ గృష్ణుఁడు తోడు కాఁగ విజయధ్యానంబు కావించె నా
రా! నేఁ డాతఁడు తోడు లేని విజయుండై విక్రమప్రక్రియన్
బూనన్ బొత్తిగఁ జాలఁడయ్యెఁ మదికిన్ బోరామి యిట్లయ్యెనా! 32

నెట్టన నిట్టు లాటవికనీచులు పట్టిన గోపకాంత లా
కట్టెఁడిచేఁత లయ్యెడఁ బొకారుచు దిక్కుదివాణ మేదియున్
గట్టిగ లేక యెల్లరు వికావికలై తమదిక్కు తామె గ
న్పట్టినవట్టు చూచుకొని పాఱిరి పాపము! భీతచిత్తలై. 33

ఇది విభ్రాంతిగఁ దోఁచి తోడుపడు దిక్కే లేక ప్రారబ్ధ మి
య్యది యిట్లయ్యెనె యంచు నేర్చి విజయుం డాత్మీయవర్గంబులోఁ
దుది కే ముప్వురో నల్వురో మిగిలి సంతోషమ్ము రవ్వంతఁగాఁ
బొదవన్ వారిని వెంటవైచుకొని తాఁ బోయెన్ మహాదీనుఁడై. 34

అటఁ జని హస్తినాపురమునందలివారలు తన్నుఁ గాంచి యు
త్కటమగు చింతలో మునిఁగి తద్దయు బెగ్గడిలంగ నప్పు డ
క్కట! కథలన్ని వార లెఱుఁగంగ విచారముతోడఁ జెప్పి యే
మిట స్తిమితంబు లేక మితిమీఱిన దుఃఖము వొంది యిట్లనెన్. ౩౫

నిచ్చలు నాకుఁ బ్రాణమయి నెవ్వగ నా మదిఁ గూరనీక య
త్యచ్ఛదశావిశేషమున నొప్పిన నా చెలికాఁడు బంధువుం
డచ్చట నొక్కచో మరణ మందుట చూచితి, సర్వయాదవుల్
చచ్చిరి; పాండవేయు లిఁక సత్త్వవిహీనులు కారె ధారుణిన్. ౩౬

వాసన లేని పూవువలె వాడిన తామరతూడువోలె నా
సాసలు దక్కి మిక్కిలి ప్రయాసమునన్ జనుదెంచినాఁడ, స
న్న్యాసులమైతి మింక మము నారసి మేలును గీడుఁగాని మా
కోసము పొందువారెవరో! ఘోరమహాపద దాపరించెడిన్. ౩౭

నా గాండీవము నాదునేర్పు భువిలోనన్ బేరు పెంపొంది యే
దో గావించె నటంచు వీఁగియు రణోద్యోగంబులో సంతతో
ద్యోగంబున్ వెలిఁబుచ్చియుంటి; నది యా వేళన్ మహాచిత్రమై
సాగన్నేరకపోయె; జన్మ మిఁక నిస్సారంబుగా నెంచెదన్. ౩౮

పదపడి పాండవేయు లది భావిమహాపద కొక్కగుర్తుగా
మది గుఱుతించి యంత నభిమన్యుకుమారుఁ బరీక్షితున్ ముదం
బొదవఁగ రాజుఁ జేసి తమ యోపిక సూపిన త్రోవ నందఱు
య్యదనునఁ బోవఁజొచ్చి రిఁక నప్పటి ముప్పును జెప్పనొప్పునా! ౩౯

కాని యదేమిచిత్రమగు కర్మమొ! ధర్మజువెన్క వచ్చు న
మ్మానుసు లేవు రయ్యెడఁ గ్రమంబుగఁ బ్రాణము వాసి రంత న
మ్మానవనాథుఁ డొక్కఁ డనుమానము లేక విచారబుద్ధియున్
బూనక బొందితో నరిగె భూమిని బాసియు స్వర్గసీమకున్. ౪౦

అయ్యెడ దేవతాపతియు నాదరమేదురబుద్ధి సూపి, రా
వయ్య మహాప్రభూ, విధినియంత్రణ యేరికిఁ దప్పదయ్య నీ
కయ్యములోన నాఁడు మొనగాఁడగు ద్రోణుని మోసగింపఁగా
నెయ్యెడ దాని దుష్ఫలిత మింతయొ యంతయొ పొందఁగావలెన్. ౪౧

అంచు మహేంద్రుఁ డాతని కనాదిగ నున్న సమస్తయాతనా
వంచితనిత్యజీవులగువారిని లెస్సగ భృత్యుచేతఁ జూ
పించిన వాఁడు ఖిన్నుఁడయి పెంపఱి బిక్కమొగంబు వైచి వ
క్రించిన బుద్ధి కగ్గమయి రీతియు నీతియు లేక యిట్లనెన్. ౪౨

నా కేలా యిటువంటి యాతనల సంతాపంబు చూపించుటల్
నాకాధీశ్వర, నీవొనర్చునది యన్యాయ్యంబు కాదోటు! భూ
లోకంబందు సమస్తరీతులను సుశ్లోకుండనై బొందితో
నాకం బందికొనంగవచ్చియు మహానర్థంబె మూచూచితిన్. ౪౩

చేయఁగరాని చేఁతలు విశృంఖలమార్గములోన చూపి య
త్యాయతపాతకంబులు ననంతముగా గడియించి యా పశు
ప్రాయుఁడు కౌరవాధముఁడు పాపి సుయోధనుఁ డేఁడి! శిక్షితుం
జేయఁగ జంకినాఁడవె! విశిష్టచరిత్రుఁడె వాఁడు వాసవా! ౪౪

నా విని ధర్మజా, యిది యనావిలచిత్తుని మాట యానె! నీ
భూవలయంబులోఁ గలుగు బుద్ధులు నాకములోన న్యాయముల్
కావని లెస్సగా నెఱుఁగఁగాఁదగు; నీకును వాని కెన్నఁ డే
వేవి కటుంబరోషములు నీసును గాసియు నున్న నుండెఁబో! ౪౫

ఆతఁడు యుద్ధరంగమున నాత్మసమర్పణబుద్ధితోడ ని
ర్వాతపు దివ్వెవోలె నిలువంగను నోఁచినవాఁడు; వాని కే
పాతక మున్న సర్వమును బాసియు స్వర్గ మలంకరించె, నీ
కాతని తత్త్వమే తెలియదందును విందువుగాని చెప్పెదన్. ౪౬

వాఁడొక గొప్ప జేఁడు కురువంశములోపల రాజరాజు; నా
నాఁడు సమస్తరాజ్యము జనంబులు సంతస మందురీతి మో
మోడక నేల యేలి తన యుద్ది యొకండును లేనిబాటలో
నాడినదాట పాడినది యంతయుఁ బాటగఁ జేసె నిచ్చలున్. ౪౭

కౌరవరాజ్యమం దొకఁడు గాని విచారముతోడ జీవయా
త్రారథ మెన్నఁడే నడపి తల్లడ మందియుఁ గుంది మ్రందెనా!
వేరమిఁ జేసి నీ వతని విజ్ఞత లేశ మెఱుంగలేక యీ
ధోరణి చూపినాఁడ విది దుందుడుకే యగునయ్య ధర్మజా! ౪౮

అన్నలు దమ్ములున్ గలఁత లందుట గానమె! దానఁ జేసి నీ
యున్నతి తగ్గునా! మఱి సుయోధనుఁ డెందును రాచకీవిలో
వన్నెయు వాసిఁ బాసి రిపువర్గము నూడిగముం బొనర్చెనా!
యన్నియు నీ వెఱింగి యనయం బిటు కుందుట పాడియాప్రభూ !! ౪౯

ఉనికియు నొక్కచో మనికి యున్నతజీవుల కెట్టు గిట్టు ? దా
నిని గుఱుతింపఁగావలదె ! నీ పొడ వానికి సమ్మతంబు గా
దని నరకంబు నిత్తునె? మహావిభవంబున రాజ్య మేలి కీ
ర్తిని గడియించి స్వర్గ మరుదెంచినవాఁ డెటువంటియోగ్యుఁడో !! ౫౦

చిన్నతనంబు చేష్ట లొక చెట్టగఁ బఱ్ఱెదవేని వానిలో
బన్నము లిర్వురన్ సమవిభాగముగా గడియించినట్లె; మీ
యున్నతి వారి కెట్టులొ తదున్నతి మీకును నట్లె; లోకమం
దున్న పరస్పరేర్ష్య లొకఁడూఁడొనఁగా వచియింపనేలొకో !! ౫౧

సంగరరంగమం దొకఁడు సాధువు - వేఱొకరుండు నీచుఁడం
చుం గణుతింపఁగా నెదియుఁ జొప్పడ; దప్పుడు భీష్ముఁడంతవాఁ
డుం గతజీవుఁడౌట కెవఁడున్ మొన తీర్పఁడు న్యాయదృష్టితో
డం గమనించినన్; జయము డాంబికమే యగు నట్టిపట్టులన్. ౫౨

ఒకనికిఁ జిక్కువాఁడె ధను వొద్దికఁ గేల ధరించు ద్రోణుఁ; ? ద్వే
నికనెప మెన్ని కూసి యతనిన్ నజకించితి వట్టినేర్పు చూ
పక కురురాజ్యసంపద గభాలున గుప్పిటఁ బట్టవచ్చునా!
తికమక లేల నీ విఁకఁ బదింబది నారట మందఁబోకుమా!! ౫౩

రథమును డిగ్గినాఁడు సమరంబున ధర్మ మతిక్రమింప ము
ష్పథ మగునంచుఁ గ్రీడి యవశంబుగ నాఁగిన సాగఁద్రోలుచున్
గథలు వచించి హెచ్చు తమకంబునఁ గృష్ణుఁడు కర్ణుప్రాణ మె
వ్విధమునఁ దీసెనో యెఱుఁగవే! కురురాజ్యముకోస మత్తఁజిన్. ౫౪

కావున వాని నట్టె పెడగా నొక ద్రేవల నెట్టు మెవ్వరే
యే విధమైన దుష్కృతము లే సుకృతంబు లొనర్చినారొ! నీ
కా వగ యేల! స్వర్గమున నందిన సౌఖ్యము జుట్టుకొమ్ము నీ
కేవి - హితమ్ములో పలుకు మిమ్ముగఁ దీర్చెద సర్వ మియ్యెడన్. ౫౫

అని సురరాజు వాని హృదయంబున నీరిక లెత్తు కోరికల్
తనియఁగఁ దీర్చి తమ్ములను దక్కిన బంధులఁ బేరుపేరుగాఁ
గనుఁగొనఁజేసి, కావలయు కర్మము ధర్మము సర్వ మత్తజిన్
బొనరిచి వారి గాథలకుఁ బూర్తిగ స్వస్తియుఁ జెప్పె నంతటన్. ౫౬

వీరల గాథ లావల వివిక్త పురాణ కథాన్వితంబుగా
భారతమయ్యె; వ్యాసుఁ డొక వంకను దిద్ది తపస్వివర్గమున్
జేరిచి తోఁచినట్టులు విశేషములన్ బరికించి ధర్మవి
స్తార ముపన్యసించెనఁట; దానికి మార్పొకయింత లే దిలన్. ౫౭

వేదములందు గూఢమయి విజ్ఞులకేని యెఱుంగరాని స
ద్బోధము లెన్నొ భారతము బోధ యొనర్చునటంద్రు; దానినిన్
గాదనఁబోము గాని గుణకర్మ విభాగనిమిత్తవర్ణ దు
ర్వాదము లెన్నొ సాగె నపవర్గము చేర విచిత్రరీతిగా. ౫౮

అందఱు క్రమందఁ బాండవుల యర్భకుఁడైన పరీక్షితుండె యా
క్రందము క్రందు మిన్నొలయఁగా నొక యేలికయై విచిత్ర వృ
త్తిం దన కాలమున్ గడపి తీవ్రవిషానలదగ్ధుఁడై మృతిం
బొందెను; వాని జీవితము బొత్తిగ వ్యర్థమె యయ్యె నిద్ధరన్. ౫౯

ఒగి జనమేజయుండనెడి యొక్కఁడు వాని సుతుండు తండ్రికై
వగచియు, సర్పజాతులను ధ్వంసము చేసెడి యజ్ఞసిద్ధికై
మొగిసియు నెవ్వఁడో యొకఁడు పూని ముఖస్తుతి సేయఁ బొంగి యా
పగ మొదలంటఁ గోసికొని భారతగాథ వినంగఁ జొచ్చెడిన్. ౬౦

వ్యాసుఁడు శిష్యరత్నమును బంపి సవిస్తర మిట్టి కావ్య వి
న్యాసము వాని ప్రోల హృదయం బలరారఁగ వర్ణనంబులున్
జేసియుఁ జెప్పఁగాఁ బనిచెఁ; జిందఱవందఱగాఁగ నున్న యే
వో సరిక్రొత్త గాథలు ననూహ్యములైనవి చేరె వానిలో. ౬౧

నిండు సభాముఖం బదియు నేమముగా విను గాథ లాపయిన్
పాండవధార్తరాష్ట్రుల యపారపరాక్రమతారతమ్యముల్
భండనసీమ నొండొరుల బద్ధవిరోధము లిట్టివాని నొ
క్కండడన నేల సర్వము ముఖాముఖిగా వినిపించె వానికిన్. ౬౨

వానికిఁ బక్షపాత మొకవంక బలీయముగాఁగ దానికిన్
మానియు నడ్డమాఁకయగు మాటయు నాడక ధార్తరాష్ట్రులన్
గానియు గర్వ సేయని యొకానొక ధోరణిలోన చూపి యెం
తేనియుఁ దృప్తి వొంది యిదమిత్థమటంచు వచించె సర్వమున్. ౬౩

తప్పదు తండ్రితాతల కథల్ వినుపట్టుల నెంతవారికిన్
దప్పని స్వాభిమానము; ముదంబున వక్తయు శ్రోతభావ మె
ట్లొప్పునొ చూచి తేల్చి యతఁ డూఁకొనునట్టులె వాకొనంగ, నే
మొప్పము గల్గనేర దిది ముఖ్యముగా గమనింపఁగాఁదగున్. ౬౪

సైంధవఘట్టమం చొక విచారకథాకథనంబు భారతం
బందుఁ గనంబడున్ గద! తదర్థము లెస్సగఁ జూడ బుద్ధికిన్
బొందిక కాదు; సైంధవుఁడె పుత్త్రునిఁ జంపెను ఘోరకర్మ మం
చుం దన తీర్పునిచ్చె నిది చూడఁగఁ గ్రీడిది న్యాయ మెట్లగున్? ౬౫

శివుని యనుగ్రహంబు ఫలసిద్ధికి మూలము గాఁగఁ జేసి యా
కువలయనాథుఁ డంత ననుకొనివిధంబున నాఁడు రేఁగి యా
హవమున నడ్డగించినది యంతయు సత్యమె కాని కజ్జవా
ని విగతజీవుఁ జేసినది నిక్కము ద్రోణుఁడు కర్ణుఁడే యగున్. ౬౬

వారిని జంపఁగాఁ గడఁగి పార్థుఁడు నాఁటి వ్రతంబు పూనినన్
గౌరవమే కనంబడునుగాని యిదేమి విచిత్రకర్మ! మా
తీరునఁ దాను సైంధవుని ద్రెచ్చెదనంచుఁ బ్రతిజ్ఞ చేసి యా
పౌరుష మట్లు చూపెఁ దన వక్రపథంబు ముదంబు గూర్పఁగా. ౬౭

అరయఁగ భీష్ముఁ జంపినది యర్జునుఁడే గద! యందు మూల మె
వ్వరొ యని యా నపుంసకునివంకను జూపిన లాభమేమి! సం
గరమున ద్రోణుఁ జంప మొనగాఁ డెవఁడన్న భయంబుఁ జేసి చే
సిరి యొక యుక్తి పాండవులు; చెడ్డపడిపోయె రణంబుధర్మముల్. ౬౮

అట్టి కుయుక్తితో ఫలిత మందిన ధర్మజువంక ద్రౌణి చూ
పెట్టెనె క్రోధ? మిట్టియెడ పేఱుగ నర్జునుఁ డేల చూపెనో!
బెట్టిదులైన కుంభభవు భీష్ముని గ్రీడికుమారుఁ జంపఁగా
నిట్టివి కారణంబులుగ నేర్పడె భారతయుద్ధభూమిలో. ౬౯

యావద్భారతభూమిలో వెలయు నీ వ్యాసర్షి సారస్వత
ప్రావిర్భావము వింతవింతలుగనై యత్యంతభేదమ్ము చే
నేవో కొన్ని యభూతకల్పనములే యేపారి కావింప నా
యా వాదంబులు నుద్భవిల్లినవి విఖ్యాతంబులై యెల్లెడన్. ౭౦

ఇమ్ముగ నెవ్వరేని వచియింతురు 'కర్ణుఁడు లేని భారతం
బి మ్మహి లే'దటంచు; నుతియించిన ధోరణిగాని కర్ణు రూ
క్షమ్ముగఁ బల్కు సామెతయుఁగాదు; కథావిధిలోఁ దదీయశౌ
ర్యమ్మున కట్టి ప్రాభవపరంపర లెస్సగఁదోఁచుఁ జూచినన్. ౨౧

మూలములోన కర్ణుని యపూర్వపరాక్రమదానధర్మస
చ్ఛీలము లానుపూర్వికవిశిష్టపథంబున వర్ణితంబులై
చాలఁగ హృద్యమై తనరె; సర్వము వానిని దెల్గుభారతం
బేల యుపేక్షచేసెనొ! విధీ! యది కర్ణుని దుర్విపాకమా!! ౨౨

విను జనమేజయప్రభువు వీనుల కెయ్యది యింపు నింపు వా
నిని వినిపింపఁగాఁదొడఁగి నేమము దాల్చిన మూని కర్ణు శ
క్తిని సహితంబు కౌరవుల దృష్టిని జూచి యుపేక్ష చేసె; దా
నిని సయితంబు తెల్గునను నిల్పిన నాథుఁడు లేఁడు చూడఁగా. ౨౩

కావునఁ గర్ణు దిగ్విజయగాథలఁగూర్చి తెలుఁగుభారతం
బేవియుఁ జూపదయ్యె నిఁక నెట్లు మదిన్ గుఱుతింత్రు కర్ణు శౌ
ర్యావహవీరయాత్ర? లది యట్టిదిగాఁగ విశిష్టమైన త
జ్జీవితసౌమనస్యమున చెల్వును లోక మెఱుంగ దక్కటా! ౨౪

సమయము చూచి పాండవుల సత్త్వముమాత్ర ముపన్యసింప నే
మము గయికొంచు నావలఁ గ్రమంబునఁ గౌరవపక్షనైచ్యభా
గము వెలిఁబుచ్చఁగాఁదొడఁగి కావలయున్ మఱి కర్ణు వీరవి
క్రమమును లెస్సగా నణఁచి కైతను వ్రాసిరి మూలకర్తలే. ౨౫

ఆదిని భారతం బుదయమందిన ఘట్టముఁబట్టి చూడ నీ
భేద మెఱుంగ వీలగును; బృథ్విని గౌరవరాజ్యపాలనం
బేదియు చూపినారె యొకరేనియుఁ దెల్గున? నట్టిదైన మ
ర్యాదకు నోఁచియుండరె మహామహిమాన్వితులైన కౌరవుల్. ౨౬

పదుమూఁడేండ్లు సుయోధనుం డమితభూభారంబుఁ దాఁ దాల్చి సం
పదలన్ బ్రోదియొనర్చి రాజ్యము మహాభాగ్యంబుగా సల్పి యిం
పొదవన్ దేశము నేలె; నెవ్వరికి నే యుత్పాతముల్ లేక నె
మ్మదిగా లోకము హాయి వొందె-నిది తన్మాహాత్మ్యమున్ జెప్పదా! ౭౭

అది వినిగాదె ధర్మజుఁ డహో యని యబ్బుర మంది యింక నా
కెదురగు దేశ మంతయు నిఁకెట్లు చరింతునటంచుఁ జిత్తమం
దధికవిచార మంది యనుయాయులఁ జేరి విచిత్రధోరణిన్
మెదలుచుఁ గాలమున్ గడపె మీఱిన యాసునఁ గాననంబులో. ౭౮



## దుర్యోధనుని దొరతనము

ద్వైతవనంబులో నమిత దైన్యపరిస్థితిఁ గుందుచున్న కుం
తీతనయుం డొకప్పుడు మదిం బెగడొంది, సుయోధనుండు ధా
త్రీతల మెట్లు లేలునొ పరీక్ష యొనర్చి సమగ్రవార్త నా
కై తెలియంగఁ జేయుమని యాజ్ఞ యొసంగెను గూఢచారికిన్. ౧

వాఁడు మహాప్రసాదమని వానిని వీడ్కొని హస్తినాపురిన్
దోడనె చేరి కౌరవుల దోర్బలమున్ గురురాజు స్వాస్థ్యమున్
గాఢముగా నెఱింగి చని గ్రక్కున ధర్మజు మానసంబులోఁ
గాఁడఁగఁ జెప్పఁగాఁదొడఁగెఁ గానసీమఁ గ్రమంబుగా నిటుల్. ౨

దేవా, సత్య మెఱింగి వచ్చితి, మహాధీరుండు దుర్యోధనుం,
డేవారిన్ గణుతింప నేరఁ డొకయింతే నిచ్చలున్; రాజరా
జై వాల్లభ్యము సూపు, సర్వధరణీ వ్యావృత్తియే గాని దు
ర్భావం బేదియు లేదు వానియెదలో భావింప సర్వాత్మనా. ౩

దానదయాది సద్గుణ విధానములన్ బచరించి మించి వి
న్నాణము సూపి నిర్మలమనంబున దివ్యయశంబు గూర్చి స
మ్మానము నొందు నెల్లెడల మానధనాఢ్యుఁడు రాజరాజు దే
శాన సమస్తవిద్యల విశారదుఁడై వెలుఁగొందు నిత్తఱిన్. ౪

కామము క్రోధమున్ మొదలుగాఁగల వర్గము నీసడించి గా
రామున రాజ్యలక్ష్మికిఁ గరంబుగఁ గూర్చుచు నెల్లవారికిన్
సేమ మొసర్చుచున్ మదిని జింతయుఁ జీకును లేక శాశ్వతం
బౌ మనుమార్గ మేమఱక హాయిగ నేలుచునుండె నిద్ధరన్. ౫

## దుర్యోధనుని దొరతనము

అనయము నీతిమార్గము రవంతయు వీడక స్వీయ 'బాధ్యతన్'
గనుఁగొని పౌరజానపద కార్యము లన్నియుఁ జక్కఁ దిద్ది పా
లనమున బద్ధదీక్షయు విలాసములన్ దగు శ్రద్ధ సక్రమం
బున గుఱుతించి యెల్లరకు మోదము గూర్చు సుయోధనుం డిలన్ ౬

అతఁడు గతస్మయుండయి యహర్నిశమున్ గడు మేలు చేసి స్నే
హితులనుబోలె భృత్యుల నహీనసమాదరబుద్ధిఁ జూచు; బం
ధుతతులమాడ్కి మిత్రులఁ గనుంగొను; బాంధవవర్గ మెల్ల భూ
పతులుగ నాత్మలోఁ దగిన భావన ముంచియు గారవించెడున్. ౭

వెలయఁ ద్రివర్గముల్ నృపుని విజ్ఞత-యొప్పిదమైన సద్గుణం
బులను సమన్వయించి తమ బుద్ధికి నాతఁడు పక్షపాతదృ
ష్టులు చవి చూడనట్టి పరిశుద్ధుఁడై యంచు నెఱింగి యాసతోఁ
గలకలలాడుచున్ సుఖముగాఁ జెనుపొందుచుఁ జేరె నాతనిన్. ౮

అరయఁగ సామదానముల నన్నిట శాస్త్రము చెప్పినట్టు లా
నరపతి నిర్వహించు; నొకనాఁడును సైతము దారి తప్పి యం
తరువును మీఱఁ డాతని విధంబు విచారణసేయ నుత్తరో
త్తరము మనోహరంబయి ముదం బొనఁగూర్చును సజ్జనాళికిన్. ౯

ఒనర గురూపదిష్టమగు సూక్తిని బాయక దండ్యులైనవా
రిని గడు లెస్సగా నరసి రీతియు నీతియుఁ గల్గి శిక్ష వే
యను వెనుకాడనేరఁ డది యాతని పద్ధతి; పక్షపాతబు
ద్ధిని లవలేశమేఁ గలిగి తీర్పఁడు తీర్పులు నిండుకొల్వులో. ౧౦

సైఁపఁడు ధర్మవిప్లవము-శాంతిని గోరును, మంత్రగుప్తిలో
నోపినవారి నేర్పఱిచి యుక్తిగ శత్రురహస్యమన్న దే
దో పరికించు; రాజ్యమున కూఁతమునయ్యెడివారి బాములన్
బాపును; న్యాయమూర్తియగు పార్థివుఁ డాతఁడు ధర్మనందనా! ౧౧

చేసిన మే లెఱుంగు ననుజీవుల నాతఁడు సంతసింపఁగాఁ
జేసి కృతజ్ఞతాగుణముచే మఱి వశ్యులుగా నొనర్చు; నే
కోశములోన లోభ మను కుత్సితభావము కానరాదు, సం
తోసమె వానిభాగ్య మిఁకఁ దొందఱపాటతఁ డొందఁ డెన్నఁడున్. ౧౨

నలుగడ నేల యేలుచు ననారత మాతఁడు నిండుకొల్వులో
పలఁ బలు 'రాజకీయములు' పారము ముట్టగ నేర్చి తీర్చు; నా
వల నఖిలావనీపతు లపారభయంబున దోయిలించి జో
తలు కడుభక్తితోఁ గ్రమపథంబునఁ బెట్టుచు నుందు రిమ్మహిన్. ౧౩

నిచ్చలు క్షత్రియోత్తములు నెయ్యము వియ్యము గోరి భక్తితో
వచ్చియు నిచ్చు వాజిగజవర్గము పెంపయి కొల్వుకూటమం
దచ్చట ముచ్చటన్ జరుపునప్పుడు కౌరవచక్రవర్తి య
త్యుచ్చదశావిశేషమున కువ్విళు లూరుచునుందు రెందఱో. ౧౪

తడవులఁబట్టి దేశము ముదంపడి క్షామము లేక క్షేమ మె
క్కుడు గడియించెఁ; గర్షకులకున్ గురుభూములు హాయి నిచ్చు; నె
క్కడ నొకఁడేనిఁ దిండికిని గాలిన మానిసి లేఁడు; చూడ నె
య్యెడను సమస్తసంపదలు వృద్ధిని బొందె విచిత్రరీతిగా. ౧౫

కౌరవరాజునేలుబడిఁ గాంచు సదృష్టముఁ జేసి భూము లా
తీరుగ దేవమాతృకలు దివ్యముగా ఫలియించు; నీటి కా
ధారములైన కాలువలు త్రవ్వియు సస్యసమృద్ధి చేసి యే
పారు సుభిక్షమే వెలయునట్టు లొనర్చు సుయోధనుం డిలన్. ౧౬

పంటకుఁ దోడు నెల్లెడలఁ బాఁడియు నిండఁగ హాళికాలి యే
తంట-తఫావతుల్ పొసఁగుదారులు ద్రొక్కక పంటభూములన్
గంటను వత్తి వైచికొని కాచుచు సర్వవిధాల భాగ్య మిం
టింటను బిచ్చటిల్ల సుఖయించు సుయోధను పాలనంబులో. ౧౭

వృత్తికి వృత్తి కెయ్యెడను వేఱిమి సుంతయు లేదు; గ్రామముల్
పత్తనముల్ పరస్పరము భాగ్యము పొందిక నందుకొంచు న
త్యుత్తమమైత్రితోఁ బొదలు; నొయ్యన వర్ణవిపర్యయంబు లే
దిత్తఱి; వాని రాజ్యమున నేఁడియు లోపము లేదు ధర్మజా! ౧౮

జనపదలాభ మేమఱని సాధుచరిత్రుఁ డుదారుఁ డా సుయో
ధనుఁడు వసూపమానుఁడు ముదంబున రాజ్యము నేలుచుండ నా
తని గుణరాశిలోఁ దడిసి తాన స్వయంబుగ సర్వధా ధనం
బును బ్రసవించు మేదిని యపూర్వమహామహిమంబు సూపుచున్. ౧౯

మానధనాఢ్యులై కరము మన్ననచేఁ జెలువారి శౌర్యమున్
బూని సమస్తభాగ్యములు పొంది మెలంగు ధనుర్ధరుల్ నిజ
ప్రాణములైన నిచ్చి తమవంతు ఋణం బది యీఁగఁగోరి య
మ్మానవనాథు నాజ్ఞలు ప్రమాణముగాఁ దలదాల్తు రెప్పుడున్. ౨౦

ఎన్నఁడుగాని యాతఁడు వహింపఁడు కేల ధనుస్సు; మోమునం
దెన్నిక సేయఁ గోప మొకయింతయుఁ గానఁగరాదు; రాజలో
కోన్నతుఁ డా సుయోధను మహోన్నతశీలమె యెల్లవారికిన్
గన్నులపండువై యమితగౌరవమున్ బచరించు నిద్ధరన్. ౨౧

సామము చూపఁగాఁ దగిన స్థానము నెన్నఁ డుపేక్షసేయఁ డిం
కేమి యొనర్చినన్ ఫలిత మీయనిచోటఁ దురీయసాధనం
బేమఱియుండఁ డా నృపతి యిమ్ముగ నాలుగుపాయముల్ మహా
స్వామి! నిజప్రతిష్ఠ దయివాఱు తెఱంగునఁ జూచు నిచ్చలున్. ౨౨

అతఁడు నృపాసనస్థుఁడయి 'యాలనపాలన' సేయుచుండఁ జిం
తితమగు కోర్కె యేరికి మదిన్ నిలువంగను లేదు; లోకు లా
మెతలుగ వాని మాటలు ప్రమేయము నెంచి తదీయశాసనం
బతివినయంబుతో సరవి నౌదల దాలుతు రేకతానులై. ౨౩

నరపతి చారచక్షువయి నల్వురి మేలును గీడు లెస్సగా
నరయుచు దేశదేశములయందలివార లొనర్చు పూజలన్
బొరయుచు వారొసంగెడి యపూర్వబహూకృతు లందుకొంచు ని
బ్బరముగ మోయుచుండు భువిభార మనంతుఁడువోలె నిచ్చలున్. ౨౪

సమయము చూచి తమ్మునిఁ బ్రజాపరిపాలన సేయ యౌవరా
జ్యమున నలంకరించి యనుయాయి జనంబులు నిచ్చ మెచ్చ మో
దమునఁ బురోహితుం డనుమతంబని చూపెడి త్రోవ యాగముల్
క్రమముగఁ జేయసాగె గుణగణ్యుఁడు కౌరవనాథుఁ డిత్తఱిన్. ౨౫

ఈ విధమైన యాతని యహీనపరాక్రమయుక్త సర్వతే
జోవిభవోగ్ర సుందరవిశుద్ధ మహీపరిపాలనం బిలన్
భావిపురాతనాద్యతనపార్థివజాతికి మేలుబంతిగాఁ
గావుట ధర్మరా జెఱిఁగి కష్టమనస్కుఁడె యయ్యె నొయ్యనన్. ౨౬

ఈ కథలన్ని వాస్తవములే యని యెంచఁగవచ్చుఁ దొల్లి యా
యా కవు లెందఱో తమ మహాకృతులందు వచించువానినే
గైకొని వ్రాసి చూపితినిగాని మదీయకవిత్వకల్పనా
పాకము గాదు భాసుఁడును భారవి చూపిన త్రోవలే యగున్. ౨౭

తెనుఁగున నన్నయాదికవిధీరులు వ్రాయఁదొడంగు భారతం
బును వినిపించుకొన్న ప్రభువుల్ మఱి పాండవవంశ్యు లాదుమం
చును మది నెంచువారగుటఁజూపె సుయోధను దివ్యజీవితం
బున కిట తారుమారులు ప్రభూతముగాఁ బ్రభవించె నిబ్బువిన్. ౨౮

ఇది యొక వింతఘట్టమనియే వచియింపఁగఁ దప్పలేను, ము
మ్మొదటగ భారతంబు విను బుద్ధియుఁ బుణ్యము రెండుబాసలం
దదికినయట్లు పాండవుల యంకురమైన విశిష్టజాతికే
కుదురుట చిద్విలాసము; యగున్ మఱి కౌరవదుర్విపాకమున్. ౨౯

కవి యగువాఁడు దాస్యమను 'కర్మముకాలి' కవిత్వధోరణిన్
భువి వెలయింపఁజొచ్చిన నపూర్వవిశేషముతోడి పక్షపా
తవిధము లెస్సగాఁ బొరయు; దానికి భారతగాథ సాక్ష్యమే
యవును; సుయోధనాదివసుధాధిపులే యెరవైరి యిత్తఱిన్. 30

తనయునిబట్టి భారతకథాకవనంబున వ్యాసమౌని త
ల్లినిసయితంబు లోకువగ లేకిగ వర్ణనముం బొనర్చె, గ
ర్భిణియగు నాపె గొంతికథ విన్న సయింపఁగలేక గర్భమున్
దునుకలు చేసికొన్నదఁట దుస్సహ మిట్టిది వార్త యేరికిన్. 31

ఆమె మహాపతివ్రత నిరంతరమామె యొకానొకవ్రతం
బేమఱదంచు వ్రాసిన కవీశ్వరుఁడే యిది వ్రాయఁ గారణం
బేమయియుండునో ప్రకృతి కియ్యది సైఁపఁగఁబోలునా? తన
స్వామిసుఖంబె చూచుకొను సాధ్వి ప్రవర్తన మెట్లు గర్హ్యమౌ! 32

తన పతి పొందఁజాలని ముదంబును దానును బొందరాదటం
చును మది నెంచి సౌఖ్యమును జూడని యిట్టి పతివ్రతామత
ల్లిని గికురించి వ్రాసిన బలే! కథ యెట్టులు రక్తిఁగట్టునో
యని తలపంగఁజాలఁడొకో వ్యాసుఁడు? వానికి న్యాయమున్నదే! 33

చూచియుఁ జూచి సంధి యొకచొప్పున నొప్పక తప్పదంచు సం
కోచము లేక యుద్ధమునకుం గురునాథుఁడు పోవువేళ వ
చ్చె, చెలువొందు ధర్మమె ప్రధానముగా నని పల్కునామె యీ
నీచపుకృత్యమున్ జరిపి నెమ్మనమందు సహించియుండునా? 34

ఎదురగువార లెల్లరు సమీహితభక్తి ప్రపత్తి చూపి స
మ్మదమున దోయిలించి తమబుద్ధికి నచ్చినరీతి మెచ్చఁగాఁ
గుదురగు దొడ్డశీలమునకు న్నెలవైన పవిత్రకాంత బె
ట్టిదమగు నిట్టి కార్యము కడిందివిచారము లేక చేయునా? 35

నలువురు మాత్రమే కడుపునన్ జనియించిన బిడ్డ లీమె, కా
వల మఱికొంద ఱాదరముఁబట్టియుఁ బెంపకమందు బిడ్డపా
పలు నయి హాయిగా మనిరి వారికి వ్యాసుఁడు పెట్టినట్టి పే
రులకు నపార్థముల్ పొసఁగు త్రోవలు చూడఁగ వింత గొల్పెడిన్ ౩౬

శుభముగఁ బేరు పెట్టుకొనుచుందురుగాని యిదేమి కర్మ మా
త్మభవుల నెవ్వరేని వసుధాతలమందును 'దుర్ముఖాదు'లం
చు బిడియ మేమి లేకయును జూతురె తల్లియుఁ దండ్రి! పైగ నా
ప్రభువుల బిడ్డ; లిట్టి యశుభంబులు వల్కఁగ నోరు వచ్చునా! ౩౭

ఏదో నవ్యవిధాన మేర్పఱిచి తా నెవ్వారినో చేరి కా
మాదుల్ తృప్తిగఁ దీర్చుకోఁగలిగి తద్వ్యాఖ్యానమున్ లెస్సగా
బోధింపంగల గొంతి వ్యాసకవికిన్ బూర్ణంబుగా గౌరవం
బే దక్కించెను జిత్ర మిట్టికథలే యిందున్న వెన్నెన్నియో. ౩౮

అత్తకు నీడు కాఁదగిన దా ద్రుపదాత్మజ, యాపె మార్గమున్
గ్రొత్తది యాట పెక్కురకు ఘోరముగా స్ఫురియింప వ్యాసుఁడే
పెత్తనమున్ వహించి కనిపించినవారికి ధర్మనిర్ణయం
బత్తఱిఁ జేయఁగాఁదొడఁగె; నట్టిది ధర్మమె యయ్యె వారికిన్. ౩౯

ఇదిగోఁ దెచ్చితిమమ్మ భిక్షమనఁగా నిం కేమి మీరంద ఱిం
పొదవన్ గైకొనుఁడంచు గొంతి పలికెన్; వ్యూహంబులోఁ బడ్డ వీ
రెదియున్ దోఁపక మౌనమే గతిగ నెం తేఁగాల మట్లుండ నా
పద యా తీరుగఁ బాసి రెల్లరు మహాస్వార్థంబు చూపెట్టియున్. ౪౦.

క్రమముగ నెన్నఁడైనఁ దన కర్మము కాలియుఁ గ్రొత్తకోడ ల
క్రమమని తన్నుఁగూర్చి పలుకన్ సరిపోవని త్రోవ యెంచి, యా
యమ కుపదేశమిచ్చె నది యైదుప ధర్మమె యయ్యె; వ్యాసు వా
క్యము 'నగిషీ' యొనర్చె నిఁకఁ గల్గదు వారికి సేగి యెమ్మెయిన్. ౪౧

## దుర్యోధనుని దొరతనము

పనివడి యంత్రమున్ దన ప్రభావము చూపియుఁ ద్రుంచి బెట్టిదం
బని యనిపించుకోఁగలిగి యందఱి కున్నన లందు భాగ్య మొ
క్కనికె ఫలించె; నామె నవకంబది ముందుగ ధర్మరాజు నె
మ్మనమున నాటెఁగావున సమాంతము ధర్మము మాఱిపోయెడిన్. ౮౨

తమ్ములు నిమ్ముగాఁ దమకు దక్కిన భాగ్యము పంచుకొంచు సౌ
ఖ్యమ్మును బొందఁగాఁ దలఁచి కాదనరైరి; వధూలలామ లో
పమ్ముగ నెంచ; దా పయిని బార్థివుఁ డా ద్రుపదేశ్వరుండు మా
త్రమ్మును ధర్మవిప్లవపథంబని యెంచియు సంశయించినన్. ౮౩

సమయములోన వ్యాసుఁడును జయ్యన నయ్యెడఁ జేరి వారి చి
త్తములను జక్కఁగా నెఱిఁగి ధర్మవిచారము కొంత సేసి పూ
ర్వము కథ లిట్టివంచును బురాణమహామహిమంబు సాక్ష్యభూ
తముగ నొనర్చి వారికి ముదంబునఁ బెండిలిచేసె నిమ్ముగా. ౮౪

వ్యాసుని భారతంబను మహాకృతి పుట్టుకఁదొట్టి పెక్కు రీ
దేశములోన పాండవుల దిక్కున మ్రొగ్గుచు లాఁతివారి దే
దోసమటంచుఁ దుందుడుకుతో వచియించుట నైజమయ్యె నా
వేశము లేక ధర్మము వివేచన సేసిన నిగ్గు తేలెడిన్. ౮౫

లోకము గ్రుడ్డిదందు; రొక లోపము నొక్కఁడు సేయ దానికిన్
బ్రాఁకులు వెట్టి బిట్టు కనుఁబ్రామి యదే పరమార్థమంచు నే
దో కికురించి పూఁతలు సమున్నతధోరణిఁ బూయుచుండు; నా
యా కథ లిట్టివాని కనయంబును శాత్రములై వెలింగెడిన్. ౮౬

కౌరవులన్న మిక్కిలియు గౌరవ మప్పటి కున్న; దందుచే
భారతయుద్ధరంగమునఁ బాండవసేన యలంతిసంఖ్యలోఁ
జేరఁగవచ్చెగాని యొక చిత్రము! కౌరవభృత్యులే మహా
వీరులు-పాండవేయులకుఁ బెట్టని కోటగ నుండి రయ్యెడన్. ౮౭

ఇది ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము

## భీష్ముఁడు

అట్టి కుతంత్రజీవులగు నయ్యలలోపల భీష్ముఁ డగ్రిముం
డెట్టి యనర్థకంబయిన నీతఁ డొనర్చును; ధార్తరాష్ట్రులన్
బట్టి స్వయంబుగా నితరపక్షముయోధుల కాలిక్రిందికిన్
నెట్టిన జోదు; వీని కొక నీతియు రీతియు లేదు చూడఁగా. ౧

అడవులలోన నబ్బ యొకఁడంచును నేమము లేక గాలిదే
వుఁడు మొదలైనవారలకుఁ బుట్టిన పాండవులన్నఁ బ్రేమ మీ
తఁడు కడుఁజూపు; దానికిఁ బ్రధానముగాఁ దన జన్మ మట్టిదై
పుడమిని వింత గొల్పుటయె పో! తగు కారణ మయ్యె నియ్యెడన్ ౨

తన 'సంకీర్ణత' మాసిపోవుటకునై తాత్కాలికంబైన వృ
త్తిని జేపట్టియు ధార్తరాష్ట్రులకు మంత్రిత్వంబు గావించు వం
కను జీవించెను; బాండవేయు లనినన్ గారాముగాఁ జూచి, యే
లినవానిం దనపొట్టఁ బెట్టుకొనె నీ క్లీబుండు యుద్ధంబులో. ౩

తెలియక వీఁడె పెద్దయని తెల్చి సుయోధనచక్రవర్తి సే
నల నడపింపవయ్య యనినన్ సరియంచును నచ్చఁజెప్పి యా
వల విలువైన జీవితమువార్తలు పాండవకోటి కన్నియున్
దెలియఁగఁజేసె; మాటలకుఁ దియ్యదనంబును మప్పు నెప్పుడున్. ౪

ధనమున కెవ్వఁడైన వసుధాతలమందు భ్రమించి దాసుఁడౌ
నని యితఁ డెప్పుడున్ బలుకు; నట్టిఁడు కావుటఁ జేసి కౌరవుల్
తన కనయంబు నిచ్చు ధనధాన్యములన్ మదిఁ గోరి వారి కొ
ల్వున వసియించి కాలమును బుచ్చెను శాశ్వతదాసుఁడై ధరన్. ౫

న్యాయము వాని కిష్టమయినన్ దన యిచ్చకు వచ్చినట్టు లా
ప్యాయము గాఁగఁ బాండవులవద్దను గాలము పుచ్చరాదె! యే
లా, యనయంబు కౌరవుల యాశ్రయ మంది యరాతివర్గని
శ్రేయస మిచ్చగించు? నిది రీతియు నీతియు నౌనె జ్ఞానికిన్? ౬

అతఁడు విరాగి యందు రిదియా తగు మార్గము? స్వామిభక్తి లే
దతనికి సుంతయేని; ధనమం దభిమానముమాత్ర ముండి భూ
పతిహిత మాచరింపని యభాగ్యుఁడు భీష్ముఁడు; వాని జన్మ మీ
క్షితిని విచిత్రమై యొక విశేషము తెల్పును రాజసేవలో. ౭

పది దివసంబు లాతఁ డతిభారము వూనియు సంగరంబులోఁ
గుదురుగ నేనినేనిఁ దనకున్ సరివచ్చెడివానిఁ జంపెనే?
తుది కొకనాఁటి రేయిఁ గడుధూర్తత ధర్మజుఁ బిల్వనంపి చ
చ్చెద వినుమీ రహస్యమని చెప్పియుఁ జచ్చెను బిచ్చిచావుగా. ౮

ఈతని బ్రహ్మచర్యమున నెన్నియొ గాథలు వల్కు బ్రహ్మని
ష్ఠాతుఁ డటందు రందలి పసందు కుమారిలభట్టుఁడొట్టి వి
ఖ్యాతులు శాస్త్రవేత్తలు ప్రకాశముసేసి సకారణంబుగా
నీతని నీతి నెన్ని రది యీ ప్రజ బుద్ధి నెఱుంగదేలొకో! ౯

జనకుని కోర్కి తీర్పను బ్రచారము సేసిన బ్రహ్మచర్యల
క్షణములెగాని స్వేచ్ఛగ విచారము సల్పి విరక్తి నెంది పూ
నిన వ్రత మేది గా; దితని నేమములోని విశేష మూహ కం
దనిదియుఁ గాదు; లెస్సగ ముదంపడఁదగ్గది కాదు విన్నచో. ౧౦

ఉత్తమమూర్తివై యొకరి యోగును బాగును లెస్సఁజూచి యా
పత్తిని మాపఁగాఁదగిన పద్ధతి యీతని కున్నఁ గౌరవుల్
చత్తురు వారి కర్మమని శాంతమనస్కుఁడువోలె నేదియో
చిత్తమునందు దాఁచుకొని చేయునె వేఱిమి రెండువైపులన్ ? ౧౧

కపటియె కానినాఁ డితఁడు కర్ణునిఁగూరిచి నిందఁగొల్వులో
నెపములు వెట్టి యల్పుఁడని నిందలు మోపునె ? స్వామిభక్తిలో
సఫలత నొంది ధన్యమగు జన్మము నెత్తిన కర్ణు ధిక్కరిం
చు పరమనీచుఁ డీతఁ డెటు చూచిన వంచకసార్వభౌముఁడే. ౧౨

అదియునుగాక కర్ణుని రహస్యముగా నొకనాఁడు పిల్చి చె
ప్పెద వినవయ్య రాధకును బిడ్డవు గా విది నీదు పుట్టువం
చది యిది పల్కి కౌరవుల యాశ్రయమున్ విడనాడుమంచు నె
మ్మదిగఁ గుయుక్తి పన్నె; నొక మానిసియే యితఁ డీ జగంబునన్! ౧౩

మాటికిమాటి కీతఁ డభిమానము పాండవులన్నఁ జూపి మో
మోటమి లేక కౌరవ సమూహము నెంతయు నీసడించుఁ దా
నోటికి వచ్చినట్టులు వినోదముగాఁ గురుపక్షవీరులం
దోటమి వెట్టి కొల్వున దురుక్తులు పల్కుచునుండు నిచ్చలున్. ౧౪

తుది కవసానకాలమున ధూర్తుఁడు భీష్ముఁడు 'వృద్ధనారి'యై
యది యిది మేలు కీడనుచు నక్కఱఁబట్టని వొడ్డ నీతు లొ
ప్పిదముగఁ జెప్పఁగాఁదొడఁగె వీఁడు ధర్మజుఁ డాలకింప, ని
ట్టిది సహజంబె దైహికపటిష్ఠత తగ్గిన నేరికేనియున్. ౧౫



# ద్రోణుండు

ఇతనికిఁ దోడు ద్రోణుఁ డొకఁ డిద్ధమహాగ్నికి వాయువట్లు సం
తత మితఁడా సుయోధనుని ధాన్యధనంబులు చూఱకొంచు గొం
తి తనయులన్న మోహపడి తీర్పులు దిద్దును; బాలు ద్రావి-యు
ద్ధతిఁ జనుకట్టు గ్రుద్దినవిధంబున నుండును హస్తినాపురిన్. ౧

వీని చరిత్రసైత మొక వింత వినోదము గొల్పు, నీతఁ డ
వ్వానివిధాన నేటఁబడి వచ్చినవాఁడని చెప్పలేము; కా
నీనునికన్న నీతఁడు జనించిన పద్ధతిలోన మిన్నగాఁ
గానఁగరాఁడు; చిత్రమగు గాథ యొకానొకఁ డున్న దియ్యెడన్. ౨

ఒకనాఁ డొక్కెడ నేటినీట నెవఁడో యోగీశ్వరుండైనవా
నికి నొక్కర్తుక జారిణీవనిత కాన్పింపంగఁ దచ్చిత్తమున్
వికలంబై నిజదేహమే మఱచెఁ దద్వీర్యంబు తత్ప్రాంతభూ
మికి జాఱం గని దాని ద్రోణమున నెమ్మిన్ జేర్చి కాపాడఁగా. ౩

అదియే ద్రోణుఁడుగాఁగ మాఱెనఁట; యిం దావంతయే సత్యము
న్నదియే? కేవలశుక్ల మెన్నఁడయినన్ సంతానముం గల్గఁజే
యదు; కానీ యిది మౌనిపుంగవుని మాహాత్మ్యంబొ! కాకున్న ని
ట్టిది యెంకేని జగంబులోఁ గలిగెనే! యెవ్వారలుం జూచిరే!! ౪

జలకములాడు జారిణిని జయ్యనఁ జూచిన యోగి కిట్టి బు
ద్ధులు కలుగంగ న్యాయమె? బుధుల్ విని మెత్తురె వాని! వాని బి
డ్డలు గుణవంతు లౌదురె కటా! యిది నమ్మఁగ నేరనయ్యెదన్
గల విటువంటిగాథ లోకకాలములోఁ గొఱగాని వెన్నియో. ౫

అట్టి మహాభిజాతుఁ డితఁ డాశ్రమభూములలోన బాల్యముం
దొట్టి నృపేంద్రుఁడౌ ద్రుపదుతోఁ గడునెయ్యము పూనియుండెఁ గాఁ
బట్టి దరిద్రుఁ డీతనికి భాగ్యములన్న నపేక్ష మెండుగాఁ
బుట్టెను; రాజ్యమే తుదకుఁ బొందఁగ నెత్తులు వేసె నత్తఱిన్. ౬

అది గుఱుతించి రోఁతపడి యా ద్రుపదుండు నిరాకరింప న
య్యదనున భీష్మప్రాపకము నంది క్రమంబునఁ బూర్వకోపమున్
గుదురుగఁ జేసికొంచుఁ దనకున్ ముదమైన విధాన యుద్ధమున్
బదిలముగాగ నేర్పఱిచె బ్రాహ్మణజన్మము నెత్తియక్కటా! ౭

కౌరవపాండవుల్ పెనగు కయ్యములోఁ దుది కెందఱో మహా
వీరులు వీనిమూలమున వీడిరి ప్రాణము; లందు-వీని దు
ర్వారవిశేషకృత్రిమపరాక్రమవైఖరి యెన్న సాధ్యమె
వ్వారికిఁ గాదు; వీఁడు కురువర్గముపాలిట మృత్యువే యగున్. ౮

విజయుఁడు సైంధవుం దునిమివేసెద నంచుఁ బ్రతిజ్ఞ పూని య
క్కజముగ రేఁగి మోసమగు కార్య మొనర్పఁ గడంగ బెంగచే
గజగజలాడు సైంధవుని గాతును దేవత లడ్డమైన నా
భుజయుగ మడ్డువెట్టి యని పూర్తిగ నమ్మక మిచ్చి యావలన్. ౯

భీముఁడు పార్థుఁడున్ మఱియు వీరుఁడు సాత్యకి మొగ్గరంబు నా
గాము లెఱుంగునట్లు మొనగాఁ డితఁ డన్నియు నేర్పి వారికిన్
సేమము గూర్చి సైంధవునిఁ జిక్కులఁ బెట్టియు నక్కచావు కాఁ
గా మొనకట్టి చంపుకొనెఁగాదె; స్వభావము వీని దిట్టిదే. ౧౦

అప్పుడు వాని యుద్ధతికి నర్జునుఁ డోర్వక మ్రొక్కి దిక్కు లే
దిప్పుడు నీవు కావవె మహీసుర, యంచుఁ బ్రదక్షిణంబుచే
మెప్పుగఁ బల్కి వేఁడుకొన మేలొనఁగూడెడి త్రోవ యిచ్చి యా
మొప్పము తీర్చి శిష్యునకు మోదముఁ గూర్చెను మొగ్గరంబులో. ౧౧

ఇది గుఱుతింపనేరని యహీనపరాక్రమమూర్తి సాత్యకిన్
బెదరగఁజేసి యాతనికిఁ బిమ్మటఁ బార్థుని మార్గమున్ ముదం
బొదవగ నేర్పి వ్యూహమున నూఁత మొసఁగ్చెను; వీని కుత్సితం
బిదియొకఁ డందుమా! పుడమి నెన్నియొయున్నవి యిట్టిచెయ్దముల్. ౧౨

తొలుత సుయోధనుం డతనితోఁ గురుసేనకుఁ బెద్ద వీవె యి
మ్ముల మముఁ గావవే యనిన మోదము నందియు ధర్మరాజు నీ
కొలువునఁ దెచ్చి యిత్తు నని కోఁతలు కోసెను; సంగరంబులో
పలఁ బదిలంబుగా దొరకుపట్టులు పెక్కులు వీడె ద్రోహియై. ౧3

ఇట్టి కుతంత్రజీవుని మహీశ్వరుఁ డప్పు డెఱింగి బిట్టుగాఁ
దిట్టిన నోరు మూసికొనెఁ; దేనియ పూసిన కత్తి-పాలు క
న్పట్టుచుఁ బొట్టలో విషమునన్ దనరారెడు కుంభ మిట్టివాఁ
డెట్టి దురంతచేష్టలకునేనియు జంకు వహింపఁ డిమ్మహిన్. ౧౪

కూటికిఁ గొల్వులోఁ గుదిరి కుత్సితభావము ప్రోదిసేయుచున్
మాటికిమాటికిన్ దెలుఁగుమాలిన త్రోవలు త్రొక్కి ద్రోణుఁ డా
నాటికిఁ బేరుమోసిన గొనంబులు మంటను గల్పి తాను బా
హాటముగాఁ జరించెఁ దన యాటలు సాగఁగ హస్తినాపురిన్. ౧౫

తన 'సంకీర్ణ'గుణంబె కల్గుటను దద్ధాత్రీసురుం డట్టి పాం
డుని వంశస్థులు ధర్మజాదులకు బంటున్ బోలె విశ్వాస ముం
చినవాఁడై కడుఁగూర్చె; రాజతనయుల్ శిష్యుల్ మహాధన్వు లీ
తని కాపట్య మెఱుంగ లేరయిరి యుద్ధంబందు సర్వాత్మనా. ౧౬

విజయునిమీఁది మక్కువ వివేకముసైతము రూపుమాపఁ గుం
భజుఁ డొక బుద్ధిమంతుని శుభంబును జూడక వానిబ్రేలు న
క్కజముగ ముక్కచేసి తమకంబును దీఱఁగఁ దృప్తి సెంది యా
విజయుని స్పర్థ తీర్చె; నిది వింతయె గాదు తదీయవృత్తిలో. ౧౭

గోవులఁ బట్టునాఁడు తనకుం గడుఁగూర్చెడి ధార్తరాష్ట్రులన్
గావఁగలేక కృత్రిమముగాఁ దన నెయ్యుని భీష్ముఁజేరి నా
నావిధవార్తలన్ మదికి నచ్చినరీతి నెఱింగి తాను దు
ర్భావముతోడ స్వామికి భరంబగు వేదన చేసె నావలన్. ౧౮

వీరహణుండు పాపియని వేదములో వచియించు సూక్తి కీ
పాఱుఁడు పాత్రమే యగును; భాగ్యము భోగ్యము లెస్సగా మదిం
గోరి యితండు కౌరవుల కొల్వునఁ జేరి స్వజాతిధర్మమున్
దూఱి యనేకపాపములతో బలవన్మృతిఁ బొందె నయ్యెడన్. ౧౯



# కృపాచార్యుఁడు

వీనికిఁ జుట్టమై వివిధవీరకుమారుల కస్త్రవిద్యలో
జానగుత్రోవ చూపుచు విచారము లేక కృపుండు కౌరవా
స్థానము నాశ్రయించి వసుధన్ జిరజీవియు నయ్యె; వీని వి
జ్ఞానము పుట్టుపూర్వములు సంగ్రహరీతిని జాత మియ్యెడన్. ౧

వెనుక శరద్వతుండనెడి విప్రుఁడు స్వీయకులంబు లక్షణం
బును విడనాడి క్షత్రియుల పోకడ వోవుచు జీవితంబు పు
చ్చెను; మఱి యొక్కనాఁ డతఁడు చిత్తజుబారికి లోఁగి దేవవే
శ్యను గని దానిఁగూడి సరసంబు లొనర్చుచునుండె నావలన్. ౨

కలిగెను బిడ్డ యొక్కఁ డిది గాంచియు నిర్వ‘రసహ్య’మంది కా
వలసిన సౌఖ్య మేర్పడ ముభావము నెందియు నవ్వనంబులో
వల దయ లేక బిడ్డ నటు పారఁగవైచియుఁ బోయి; రంత భూ
తలమునఁ గావుకావుమని తల్లడమందుచునుండె బిడ్డయున్. ౩

ఒకనాఁ డేలిక శంతనుం డడవిలో నోరంతప్రొద్దుండి ది
క్కొకఁడున్ లేని యభాగ్యు నీ శిశువుఁ దా నొయ్యొయ్యనం జేరి వీ
నికిఁ దాత్కాలికమైన యెత్తు లొకకొన్నిం గూర్చి ప్రేమించి యిం
టికిఁ దోడ్తెచ్చెను; వాఁడె యీ కృపుఁడు-వీనిం బెంచిరిచ్చోటనే. ౪

తల్లియుఁ దండ్రియుం జొకవిధంబగు కట్టడ లేక మిశ్రమై
చెల్లని వంశమం దొక విచిత్రపు జారిణి కన్నబిడ్డయే
బల్లిదుఁడై క్రమంబుగఁ బ్రభావము సూపఁదొడంగె నంతలో
నిల్లును వాకి లేర్పడియె నీతని జాతక మన్న నిట్టిదే. ౫

క్రమముగఁ బాండవేయుల సుఖంబునె కోరుచు జీవితంబుమా
త్రము ధృతరాష్ట్రసన్నిధి సదా ముద మందుచుఁబుచ్చె; యుద్ధరం
గము సరి వచ్చునాఁ డితఁడు కౌరవపక్షమువాఁడె యయ్యెఁ బ్రే
మము దళుకొత్తఁ బాండవులమాటకె మన్నన యిచ్చె నచ్చుగా. ౬

మొత్తము యుద్ధమంతకు ‘నమూల్యపరిశ్రమ’ చేసినట్టు లీ
యుత్తమవీరుఁ డొక్కని మహోగ్రరణంబునఁ జంపెఁ గాని రా
జోత్తములందుఁ బేరు గల యొక్క మహామహులైన మచ్చుగాఁ
గత్తి కొసంగి మృత్యువుముఖంబునఁ ద్రోయఁగ లేదు పృథ్విలో. ౭

తుది కొకతూరి యల్లునకుఁ దోడ్పడి సౌప్తిక ఘట్టమందు బె
ట్టిదమగు చేష్టచేఁ దన కడిందిపరాక్రమ మట్టె చూపి య
య్యదనున నీతిబాహ్యమగునట్టి చరిత్రము ప్రోదిచేసి య
భ్యుదయము లేక జీవితము పుచ్చెఁ బదంపడి హీనసత్త్వుఁడై. ౮

అందఱు మ్రంది తుట్టతుది కాతఁడుమాత్రము నిల్చెఁగాని కా
మందులు పాండవేయు లవమానము సేయఁగఁ జొచ్చి; రాతఁ డా
నందము చచ్చి జీవితమునన్ స్తిమితత్వ మొకింత లేక యే
బందెను బడ్డ గొడ్డుబలె బాధలు వొందెను బాప మిమ్మహిన్. ౯

ధర్మజుఁడే జయించి వసుధాపతి యయ్యెడువేళ బుద్ధిలోఁ
గర్మమటంచు నేడ్చి తమకంబునఁ గృష్ణునిఁ జేరి తాను ద
ద్ధర్మజు పట్టమున్ గని ముదంబును బొందఁగ నానతీయఁగా
నర్మిలి వేఁడ-వల్లెయని యచ్యుతుఁ డాతని కిచ్చె సమ్మతిన్. ౧౦

బెరుకున జీవితం బధమవృత్తిని సాగఁగ దిక్కుమ్రొక్కుగా
నరసెడివారు లేక పరమార్థవిచారము సేయ స్వాస్థ్యమున్
బొరయక యొంటిగా నయి యపూర్వపరిస్థితి కగ్గమై మహా
నరకము చూచెఁ బాఱుఁ డొకనాఁడు సుఖంబును లేక ధారుణిన్. ౧౧

వృద్ధులు పాండవుల్ తుదికిఁ, బెద్దతనంబునఁ బేదబాఁపఁడై
బుద్ధియు సన్నగిల్లి తన పూర్వమహాదశఁ గూర్చి చింతతోఁ
బ్రొద్దులు పుచ్చు నీ కృపుని బోషణచేయఁ బరీక్షితుండు తా
నొద్దిక శిష్యుఁడై వెలయ నుండి చిరాయువునయ్యె నిద్ధరన్. ౧౨

# విదురుఁడు

వీరికిఁ దోడునీడ – పృథివీపతి కొల్వున నున్నవారిలోఁ
జేరియు ధర్మజాదుల విశిష్య నుతించుచు వారి శ్రేయమే
కోరుచు వక్రమార్గమునకుం గుదురైన విచిత్రమూర్తి-యీ
భారతగాథలో నతనిపాత్రమె ముఖ్యము; చెప్ప నేటికిన్ ? ౧

విదురుఁడు వాఁడు; వాఁ డధికవిజ్ఞుఁడటంచును వ్రాసె వ్యాసుఁ డ
య్యది యెటులున్న భారతము నంతయుఁ జూడఁగ గొప్ప సందియం
బొదవును; దానిఁ గొంతయిన నూఁకొనఁజెప్పెదఁ బక్షపాత మ
న్నది విడనాడి విందు రనునాస జనించుటఁ జేసి యిత్తఱిన్. ౨

ఈతని తల్లి తండ్రి యెవరే నగుఁగాతఁ బురాణగాథలోఁ
జూతురు వీనిప్రాభవము చోద్యము మిక్కిలి దర్పమున్ మహా
నీతిని బక్షపాతయుతనిర్ణయబుద్ధిని; గాని వీని వి
ఖ్యాతికి వీని తండ్రి యగు వ్యాసుని కైతయె కారణంబగున్. 3

చిత్రము నాఁటి ధర్మము, విచిత్రము మానుల చిత్తవృత్తి; సు
క్షత్రియులైనవారలె వికారవిచేష్టలఁ బ్రొద్దుపుచ్చుచున్
గోత్రము క్షేత్రమున్ మఱచి కోరిక లీరికలెత్తఁ దామె యా
ముత్రికసౌఖ్యముల్ పడయు ముచ్చటచూతురు నీతిబాహ్యులై. ౪

తమ్ముని భార్యలెవ్వరు ముదంబున సంతతిఁ బొందరైరి వం
శమ్మున కప్రతిష్ఠయని శంతనుసూనుఁడు భీష్ముఁ డంత చి
త్రమ్ముగ వ్యాసునిం బిలిచి తమ్ముని భార్యల నప్పగింపఁగాఁ
గిమ్మనలేక వారు పరికించియుఁ గూడిరి రోఁతమానిసిన్. ౫

పొందిక లేని కూటమికిఁ బుట్టిరి గ్రుడ్డియుఁ బాండురోగి యా
నందము లేక యట్టి తరుణంబును గ్రమ్మఱఁ గోరి వ్యాసుఁ డా
చంద ముపన్యసింప నిఁక 'చా'యని యంబిక - దాసి నొక్క-తన్
బొందున కంపె; నాబిడకుఁ బుట్టె భువిన్ విదురుండు గుట్టుగా. ౬

మూవురు మూఁడు తీరుల నముఖ్యులుగా జనియించి రాజ్యమం
దే విధమైన హక్కు-నకు నెవ్వఁడు నోఁచనినాఁడు దేశమున్
గావఁగఁజాలు నీతఁడని గైకొని యా ధృతరాష్ట్రు రాజుగా
శ్రీ వెలయంగ నిర్ణయము చేసిరి పెద్దలు కొంద ఱత్తఱిన్. ౭

ఱేనికిఁ దోడునీడ యయి రేఁబవలున్ వినయంబు చూపి యా
స్థానము నంటిపెట్టుకొని తత్పరుఁడై విదురుండు దాత్యమున్
బూనుచుఁ గౌరవుల్ తనకు బొత్తిగ గిట్టనివారు-పాండుభూ
జానిసుతుల్ కడుంగడు ప్రశాంతులుగాఁ గనుపట్ట నత్తఱిన్. ౮

క్రమముగఁ బాండుపుత్త్రుల పరాక్రమవృత్తులు వీనిబుద్ధి క
బ్రమము కలిగింప నిచ్చలు శుభంబును వారికిఁ గూర్చు; వీని శాం
తము మది నమ్మి కౌరవులు తద్దయు భ్రాంతియు నొంది వీని దా
ష్ట్యము గుఱుతింపరైరి; యనిశం బిది యిట్టులె సాగె జాలుగా. ౯

ఇతఁడు జనింపఁగాఁ బిదప నీతని తల్లియుఁ బూర్వదాస్య ము
ద్ధతి విడనాడి రాణి యయి తక్కి-న రాణులఁ జేరి హాయిగా
బ్రతికెను; మీఁదుమిక్కి-లి శుభంబులు గూర్చుచు వ్యాసహాని య
య్యతివకు గౌరవం బొసఁగె; నట్టివి వీరి కథావిధానముల్. ౧౦

అరయ వ్రతస్థుఁడై వెలయు వ్యాసుఁడు దాసిని గూడి, నాఁడు సం
బరపడెఁ గాని వానికి స్వభావములో నపకీర్తి యన్న చీఁ
దఱ కనుపట్టలే; దదియు దైవవిధానమటంచుఁ గాకికల్
బిరబిర వ్రాసె నీతి యనుపేరటఁ దాన విచిత్రఘోరణిన్. ౧౧

విదురుని జన్మ మిట్టిదయి వింత యొనర్పఁగ వీఁడు 'గంతకుఁ
గుదురగు బొంత'యన్నటులు కోరియుఁ బాండవులన్నఁ బ్రేమ పెం
పొదవఁగఁ జూచె; నిట్టి తెగ లున్నవి యన్నియు నాఁడు చేరి బె
ట్టిదముగ ధార్తరాష్ట్రులను ఛీకొనెఁ; గాలమహత్వ మిట్టిదే!! ౧౨

ఉభయులు భేదభావమున నోర్వను వీడి చరించునాఁడు తా
నభయ మొసంగి పాండవుల యభ్యుదయంబునె కోరి వీఁడు త
చ్ఛుభములకై పెనంగు; నిది చూడవె స్వభావము వీని దక్కటా!
యిభపురనాథుఁ డీతనికి నెంతయుఁ గూర్చిన నమ్మఁ డాతనిన్. ౧౩

కాని విచిత్రమై యరయఁగాఁ గనుపట్టును వీనివృత్తి, య
మ్మానవనాథు లెల్ల రభిమానము సూపియు దైవ నిర్ణయా
ధీనమటంచుఁ దాము వెనుదీయక యుద్ధము సేయ నందు నీ
మానిసి-న్యాయమార్గము క్రమంబున సర్వ మెఱింగె నిమ్ముగా. ౧౪

తాను మహాత్ములంచు నెడదన్ జిరకాలము నమ్మి ఱేని యా
స్థానములోఁ దదీయశుభసంపద లిమ్ముగఁ గోరి వాదమున్
బూనియు నుండి యుద్ధమున బొత్తిగ న్యాయము వారివద్ద సుం
తైనను గానరాదని యథార్థ మెఱింగి విరక్తచిత్తుఁడై. ౧౫

క్రమముగ నాఁటఁగోలెఁ దమకంబును వీడియు వీఁడు పాండవో
త్తముల ప్రభుత్వమన్న శుభదంబుగ నెంచఁడు రాజరాజు ప్రా
ణములు దొఱంగునాఁ డవగుణంబులు సూపిన భీము చెయ్వుల
క్రమములు గాఁగఁ దోఁచి వెటకారము చూపి మెలంగె నత్తఱిన్. ౧౬

జయమున విఱ్ఱవీఁగి యరుసంబునఁ గ్రేళ్ళుఱుకంగ నోఁచి సం
దియ మది లేక రాజ్యము మదీయమటంచుఁ దలంచి కౌరవ
క్షయమున కాత్మలో మురిసి కన్నులు కానని ధర్మరాజు దు
ర్ణయము మొగంబుఁగొట్టి మది రాపడిపోయెను నాఁటినుండియున్. ౧౭

కావున వీఁడు పాండవుల కర్మము కాలియు బిడ్డ లంద ఱా
త్రోవను జచ్చి యెల్లరకు దుఃఖముఁ గూర్చిననాఁడు సైత మా
చావునుగూర్చి కొంచెము విచారము సూపఁడు; ధర్మరాజు సం
భావన సేయఁ డాపిదపఁ బద్ధతి యంతయు మాఱె వింతగా. ౧౮

పదవి లభించుదాఁకఁ బొరపా టొక యింతయు లేక నిచ్చలున్
విదురుని గూడిమాడి తన వీలునుబట్టి సమస్తకార్యముల్
పదిలముగాఁగఁ గూర్చుకొని పార్థివుఁడైన యనంతరంబు సం
పద సమకూడ ధర్మజుఁడు వైఖరి వేఱుగఁ జూపె నత్తఱిన్. ౧౯

అన్నియు లెస్సగా హృదయమందుఁ బరీక్షగఁ జూచి ముందు రా
నున్న మహావమానముల నోర్వ మనస్సును బోక రాజ్య మం
దున్న విచిత్రవైఖరికి నోర్పు వహించి తటస్థబుద్ధియై
యన్నముఁ బున్నె మెంచఁడు మహామునివోలె మెలంగు నయ్యెడన్

రాజయి ధర్మరాజు కురురాజ్యము నేలెడునాఁడు వీనితో
మోజుగ రాచకార్యములు ముచ్చట సేయఁడు వీఁడు వానికిం
డేజము కూర్పఁగాఁ దలఁచి తీర్పగ నే యుపదేశ మీయఁ డీ
యోజను సాఁగి జీవిత మయోమయమయ్యెను నాఁడునాఁటికిన్. ౨౧

ఒకనాఁ డా ధృతరాష్ట్రుఁగూర్చి మదిలో నూహింపఁగానైన రోఁ
తకుఁ బాత్రంబగు నింద వైచియు మహాదౌష్ట్యంబు చూపెట్టి వా
నికి ధిక్కారము సేయు భీము నితఁడున్ వీక్షించి వైరాగ్యవృ
త్తికిఁ జొచ్చెన్ మఱి తీఱెఁ జిత్తమున సందేహంబు సర్వాత్మనా. ౨౨

పదపడి వృద్ధుఁ జేరి వనవాసము సేయుట నీకు నాకుఁ జే
కూరదన్నను, క్షేమము రాజ్యమున నుండుటకన్నను జావు మేలు పో
ప్రదమని హెచ్చరించె; నది బుద్ధికి నచ్చియు భార్య తాను న
య్యదనున వారితోఁ గలసి యాత్రఁ నరణ్యము సేరఁ జెచ్చెరన్.

అత్తఱి ధర్మరా జతని నాఁపఁగలేక చింతించియు దోయిలించి తా
మొత్తుకొనెన్ విచిత్రముగ మోఱకుఁబోలెఁ జరించెఁగాని కిం
చిత్తగనైన నీ విదురుఁ జేరి ప్రయాణము మాట బొత్తిగా
నెత్తఁడు వాని తత్త్వ మిదమిత్థ మటంచు వచింపనేటికిన్? ౨౪

తఱచుగ ధర్మరా జితని తత్త్వ మెఱింగియు 'క్షత్త' యంచు న
క్కఱయగు వేళఁ బిల్చుటయుఁ గల్గెను; వారు పరస్పరంబు నీ
కెఱుఁగునఁ ప్రేమబంధము మదిం బెనఁబాసిరి; పాప మట్టి యా
దర మెటు పోయెనో యొకరి తప్పిదమో గుఱుతింపఁబోలదా! ౨౫

విదురుఁడె లేనిచో నమితవిక్రములయ్యును లక్కయింట న
య్యదనునఁ బాండవేయు లెటు లయ్యెడివారో! చరిత్ర వీరి దె
వ్విధమున మాఱిపోయెడిదో! విజ్ఞు లెఱుంగకపోరు; పాండవుల్
తుది కిటువోయి రట్టి పెడత్రోవలఁ జూచియుఁ జూడనట్టుగా. ౨౬

అడవిని జేరి యాశ్రమమునందు వసించెడి వృద్ధరాజు నె
ప్పుడు నెడఁబాయఁ డితఁ డిఁక బుద్ధికిఁ దోఁచిన జ్ఞానమార్గ మా
తఁడు విన నిచ్చలున్ దగు విధంబున బోధ యొనర్చు నూడిగం
బుడుగక సేయు దంపతుల కొప్పుగ భక్తి ప్రపత్తి చూపుచున్. ౨౭

తన మరణంబు దగ్గఱుట తా గుఱుతించి యితండు సాహసం
బున నొకనాఁడు చెప్పకయె పోయి మహానదిలో 'గుబాలు'నన్
మునిఁగెను నాఁటితో నితని పోకడ యెవరికిఁ గానరాకపో
యెను; దుద కిట్టులీతని యహీనచరిత్రము మాసెఁ బూర్తిగా ౨౮

# వ్యాసుఁడు

వ్యాసుని జన్మగాథలు వివాదములోఁ బడి పాక్షికంపు ను
ద్దేశము చూపఁగాఁ దొడఁగె దీనిని గొంత విమర్శరూపముం
జేసెద దీనిమూలమునఁ జిత్రము లెన్నియొ బట్టబైలుగాఁ
జేసెద సావధానముగఁ జిత్తమునన్ గుఱితింపఁ గోరెదన్. ౧

అరయఁ బరాశరుండను మహాత్ముఁ డొకప్పుడు తీర్థయాత్రలోఁ
దిరుగుచుఁ బోయిపోయి యొక తెన్ యమునానది యోడరేవులో
నిరతము నోడ నెట్టుకొని నేమముగాఁ దన జీవితంబు నీ
సరణిని బుచ్చు కన్నె నొకసారి పరీక్షగఁ జూచి బుద్ధిలో. ౨

ఆమె యమాయికత్వమున కచ్చెరు వందియు బుద్ధి మాఱి తత్
క్షేమము చూచువానివలెఁ జెల్వను డగ్గఱి కామవశ్యుఁడై
గోమునఁ గంటికిన్ మెఱుపుఁ గొల్పెడి యామె శరీరపాటవం
బే మదిలో ననుక్షణ మహీనకుతూహలముం బొనర్పఁగా. ౩

పలుకునొ లేదొ! చూతమని భామినిఁగూర్చి తలంచు దాని చూ
పులకును మోము వాచి తన బుద్ధి మరల్పను వింతయైన యూ
చెలువున కంతరంగము విచిత్రముగా మురిపంబు నొందఁ 'గా
వలయును నీవు నేస్త'మని వాఁడనఁగా నది సంభ్రమంబునన్. ౪

స్వామి, యిదేమి బుద్ధి? తమవంటి మహాత్ముల కిద్ది చెల్లునా?
మామక జన్మమన్నఁదమ మన్నన పొందునె? యెన్నఁడేని యాఁ
గాము లెఱుంగ కిట్టు లొకకన్నె చరించినఁ దల్లిదండ్రులున్
దాము సహింతురా? యిదియుఁ దప్పుగఁ దోఁప దెమీకు నక్కటా! ౫

తనువున మీలవాసన సదా యెసరేఁగఁగ రోఁతజీవితం
బును గలదానఁ గన్యకను బుద్ధిఁ దలంపవె! నా వ్రతంబు పో
యిన నిఁకఁ దండ్రియింటి కెటులేఁగెద దోసము కాదె నాకు, నె
మ్మనమున దీని మాను మవమానము సేయకుమయ్య యియ్యెడన్. ౬

నా విని మౌని యిట్లనియె నాతి, మదీయచరిత్ర బుద్ధిలో
భావన చేసి చూడు మిది భావ్యము కాదనఁబోవు; కన్యకా
భావము నీకు మాపజని పద్ధతి చూతును దల్లిదండ్రులున్
భావిమహాశుభోదయముకైఁ దమ చిత్తము లుంతు రెంతయున్. ౭

కావున నీ వవశ్య మిది కాదనఁబోకుము నాదుమాట నీ
భావములోఁ దలంచిన శుభంబులె చేకుఱు మాఱుత్రోవకుం
బోవకు నీ కనర్థములు బొత్తిగ రాని తెఱంగు చూచెదం
జూవె! మదీయసౌఖ్యమునఁ జొక్కి తరింతువు చక్కఁగా మహిన్. ౮

అని మునినాథుఁ డప్పు డిటులాడఁగ నొంటరిగత్తె సిగ్గుచే
తను దల వంచి కాదనినఁ దప్పక శాప మొసంగునన్న జం
కునఁ గడుఁ గుంది చిత్తమునకున్ స్తిమితత్వము లేక వాని కి
ట్లనియెను స్వామి, నీ వనినదంతయు సత్యమటంచు నెంచెదన్. ౯

కాని మఱొక్కసందియము కల్గెను నీకు నభీష్టమైన దే
దైనను గాని కాదని మహాత్మ వచింపఁగ సాహసింప; ని
చ్చో నెవరైన వత్తురొ! విశుద్ధచరిత్రుఁడ, యే ప్రమాదమున్
గానఁగరాని మార్గమును గైకొని నన్నుఁ దరింపఁజేయుమా! ౧౦

నావుడు వాఁడు సంతసమునన్ దన చంకలు కొట్టుకొంచు నా
త్రోవను బోవువారికి నిరోధము కల్గెడుతీరు చేసి సౌ
ఖ్యావహమైన పొందు పొలుపారఁగ నందుఁ బొనర్చి సాహస
శ్రీ వెలయంగ సంబరము నొందెఁ దపోధనుఁడయ్యు నత్తఱిన్. ౧౧

ఇరువుర కప్పుడె యొక మునీశ్వరుఁ డుద్భవమొంది జ్ఞానసుం
దరుఁడయి తల్లిదండ్రుల ముదంబునఁ గాంచియు మ్రొక్కి వారి తా
దరమును గూర్చి; నాఁడె వసుధన్ జనవంద్యుఁడు వ్యాసనామిగాఁ
బరఁగియు వేదవాఙ్మయవిభాగము చేసె మనోహరంబుగా. ౧౨

పదపడి వ్యాసుఁ డత్తఱిఁ దపస్విగ నుండను గోరి తల్లికిన్
ముదమున మ్రొక్కి దీవెనలు పొందియు నక్కఱపట్టువేళ నీ
యెదుటికి వత్తు నాకు సెలవిమ్మని పోయి మహాతపస్సులోఁ
గుదురుగ నిల్చి పొల్చెఁ దనకుం బ్రియమైన ప్రవర్తనంబుచే. ౧౩

ఇచ్చట నీమె యావల మునీశ్వరపుంగవకారణంబుచే
నచ్చెరువొందఁజేయు తన-యాకృతి దివ్యము కాఁగఁ బెంపుమై
నిచ్చలు తల్లిదండ్రులయు నెమ్మనమందు ముదంబు కూర్చి తా
నచ్చటముచ్చటన్ జరిపె యౌవనసౌరభవైభవంబుచే. ౧౪

ఆమెనె కొన్నియేండ్లకు మహాధరణీశుఁడు శంతనుండు సు
త్రామనిభుండు కాంచి తనరాణిగఁ జేసికొనెన్, విచిత్ర మీ
ప్రేమము; వీరి కిర్వురకు బిడ్డలు పుట్టియు భీష్ముచేతిలో
గోమునఁ బెంపు నొంది తుదకున్ గడువ్యర్థులె యైరి వారలున్. ౧౫

సంతతి లేక చచ్చిన నిజంబుగ దోసము కల్గునంచు న
త్యంతము ఖిన్నమై తనదు నగ్రసుతుం బిలిపించి వంశవృ
త్తాంత మెఱుంగఁజేసి యిది దైవవిధానమటంచు వానికిన్
గాంతల నప్పగించె నిఁకఁ గల్గిరి గ్రుడ్డియుఁ బాండురోగియున్. ౧౬

వ్యాసుని వేస మప్పుడు ప్రియంబుగ లేదని యీసడించి యా
దోసము బిడ్డలం దొదవ పుత్రోవను [illegible] కాంతలంచు నా
వ్యాసుఁడె వ్రాసె భారతమునందు నిదేమి విచిత్ర మిట్టి స
న్న్యాసులు కల్గిరే పుడమియందుఁ దలంపఁగ నెన్నఁడేనియున్. ౧౭

పాపము! వీఁడు సత్యవతి పల్కినమాటను విన్నతోడనే
మాపనికై కడంగుటకు నయ్యెది వేళయుఁ గాదు కోరి నే
నే పరమవ్రతం బొకటి యెంతయు నిష్ఠ నొనర్చి వత్తు న
మ్మా, ప్రకృతంబు మానుమని యామెను వేఁడెనుగానియామెయున్ ౧౮

దానికి సమ్మతింపక ముదంబున బిడ్డలఁ జూడఁగోరి య
వ్వానిని హెచ్చరించి బలవంతము సేయఁగ నాతఁ డామెతో
మానిని, కోర్కి లేక యిది మానవు గాన రహస్యమున్న ది
ద్దానిని జెప్పెదన్ వినుము తక్కినమాటలు కట్టిపెట్టియున్. ౧౯

వ్రతమన నేది లేదు, తనవద్దకు వచ్చిన నన్నుఁ జూచి నా
జడకు నసహ్యమందునను సందియు మొక్కుచి బాధపెట్టఁగా
వ్రతమను వంక నేఁగి యొక వత్సర ముండియు సంస్కరించి నా
మతికిని నాకె రోఁతయగు మార్గము వీడియు వత్తుఁ జెచ్చెరన్. ౨౦

కాదని యందువా! విను, వికారము నైఁచియు మేనికంపుచే
బాధను బొందనట్టి యొకపాటి సహింపును జూపి రేని స
మ్మోదము గల్గి సంతతియుఁ బుట్టును దప్పక తత్ క్షణంబె; నీ
వేది యొనర్చినన్ దునికి నేను బ్రసాదముగాఁగ నెంచెదన్. ౨౧

అనిన ముదంబుతో హృదయమందలి యారట మెల్లఁ దీఱ నెం
టనె ప్రయతించి యామెయొకనాఁడు సుముహూర్తమునిర్ణయించి యా
తని విషయంబు నీదృశవిధంబని యంతయుఁ జెప్పదల్చి, న
చ్చును నినుఁ బొంద మేలుకని చూడుమటంచును బల్కె నొంటిమై. ౨౨

దానికి నౌనుగాదను విధానము చూపక కోడ లంబికా
మానిని యర్ధరాత్రమున మానసభీకరమైన వేషముం
బూని వికారరూపమున బుద్ధికి రోఁత జనింపఁజేయు న
మ్మౌనిని గాంచి చెచ్చెరఁ బ్రమాదముగాఁ గనుమూసె; దానిచే. ౨౩

ఆపెకుఁ బుట్టె గ్రుడ్డియగు నర్భకుఁ డావల దోస మయ్యె నం
చా పెను మందలించి తనయా, యిదిగోనని చిన్నికోడలిం
జూపెను దల్లి; కాని యది చూచినతోడనె తెల్లవోయి త
చ్ఛాపము దాపరించునని శాంతి వహించియు సంగమించినన్. ౨౪

కలిగెను బాండురోగి; యది గాదని యత్త విచారచిత్తయై
వలవల యేడ్చి యంబికను వ్యాసుని నింకొకమాఱు కూడఁగా
వలయునటంచుఁ గోపపడ భామిని దానికి నేవగించి యా
వలఁ దన దాసికిం గబురు పంపియుఁ గూర్చెను వారి నిర్వురన్. ౨౫

అంతిపురంబులో నౌకరి కమ్ముడువోయి యనారతంబు ర
వ్వంతయుఁ జింత లేక తన ప్రాణము మానము నిచ్చి యూడిగం
బంతయుఁ జేయుదాసి కిది యబ్బురమాయె! తలంప సంతసం
బెంతయుఁ గల్గి మానికి ననేకవిధంబుల సౌఖ్య మిచ్చినన్. ౨౬

విదురుఁడు పుట్టె నామెకు; వివేకము కల్గినవాఁడె కాని 'దా
సిది'జనయిత్రి కావుటను జేరఁడు కౌరవవంశమందు; నీ
విధముగఁ దల్లిబిడ్డల వివేకము రూపటిపోయి జాతికిన్
గుదిరికఁ ద్రోసి వంశమునకున్ గలుషంబు పొనర్చె సర్వథా. ౨౭

ఇత్తఱిఁ జిత్ర మొక్కటి పరీక్షగఁ జూచినఁ దోఁచు దాసిగా
నత్తటి నున్న యాబిడయు నంబిక, డగ్గఱివారు కావుటన్
మొత్తమువిూఁద వారలకుఁ బుట్టిన యిర్వురునైత మట్టులే
చిత్తములందు నైక్యమును జెందినయట్టు మెలంగి రమ్మెయిన్. ౨౮

కాని విచిత్ర మింకొకటి కౌరవులన్న నసహ్యాభావముం
బూని కథావిధానమును బూర్తిగ వ్రాసిన వ్యాసునంశ మీ
సూనుఁడు దాసిపుత్త్రుఁడును జూపెను ద్రావిన యొమ్ము గ్రుద్దగాఁ
బూనిన మూర్ఖువోలె; నిది బుద్ధికిఁ దోఁచెనొ లేదొ! వానికిన్. ౨౯

అరయఁగ నానుకూల్యము రవంతయు లేక విలాసినీమణిన్
ధర నెవఁడేనిఁ గూడిన వృథా ఫలితం బిటులుండు; వ్యాసుఁ డం
దఱకును నీతిబోధలు ముదంబునఁ జేసెడువాఁడు కాఁడె! యీ
తిరిపపుబిడ్డ లేల? తన ధీవిభవం బిటు పాడువాఱెనే! ౩౦

తాను నిషాదుఁడయ్యుఁ దన తండ్రినిబట్టి మునీంద్రుఁడై యర
ణ్యాన వసించు వ్యాసుఁ డిది యానని యంతిపురంబు దూఱెనే
గాని మహాపవిత్రమగు క్షత్త్రియవంశమునందుఁ బుట్టి యే
మానిని వానిఁ బొందు టవమానముగా గణుతింప దక్కటా! ౩౧

పాపము! వీఁ డెఱింగియె స్వభావము మాఱియుఁ బ్రేమ సూపఁగా
నోపును గొన్నిమాసముల నోర్పు వహింపుమటంచుఁ దల్లి కిం
దాపఱికంబు లేక తన దైహికదోషము నుగ్గడించి తా
నా పనికై కడంగె హృదయంబున సంశయ మందె నత్తఱిన్. ౩౨

వినది యెట్టులో తుదికి నార్యవిగర్హితమైన సంగమం
బీ నరులే యనంతరమహీశుల కెల్లను మూలపూరుషుల్
గా నయి రిట్టి సంకరవికారము లెన్నని యెన్నవచ్చు నే
మైనను వ్యాసుఁ డిట్టిఁడని యన్నను బాపము లేదు చూడఁగా. ౩౩

ఈతని తల్లి బ్రాహ్మణి, మఱేకొలమందును బుట్టలేదు సం
గాతము దాశగేహమునఁ గల్గె నటంచు విపర్యయంబుగా
జాతిని మార్చి వ్యాసుని యశంబును భద్రము సేయఁగోరి యే
దో తలతిక్కగాఁ బలుకుచుందురు కొందఱు స్వార్థబుద్ధులై. ౩౪

ఎవ్వఁడో వీర్య మొక్కయెడ నేటను వైచినఁ జేప మ్రింగి దా
దవ్వుల సంచరింప నొక దాశుఁడు దానిని బట్టి కోయ నం
దెవ్వతో యాఁడుబిడ్డ జనియింపఁగ దానిని దాశరాజుకై
మవ్వము వూని యిచ్చెనఁట మానిని బాల్య మతిక్రమించియున్. ౩౫

గూఁడెమువారి కందముచు గూర్చుచుఁ గోరిక లీరికెత్త నా
పోఁడిమి నాడెమై తన కపూర్వపరిస్థితి సేకరింప నా
వాడకు వచ్చు-నే పడుచువానికినైనను బుద్ధి మాఱఁగాఁ
దోడగు జవ్వనంపుమిసతోఁ దొలుకాడెను నాఁడునాఁటికిన్. ౩౬

జనకుని వృత్తిఁబట్టి యనిశంబును నావను జేరి దాని మీఁ
దనె తన జీవితంబు ప్రమదంబునఁ బుచ్చెనుగాని రాచబి
డ్డను దన కేది తక్కువని డాంబికవృత్తికిఁ దూఱలేదు కా
వుననె పరాశరుండనెడి పూరుషుఁ డాపెను బొందె నయ్యెడన్. ౩౭

అంద మెఱింగి మోహపడి యప్పటి ఱేఁడగు శంతనుండు పే
రొందినవాఁడై దానిఁ గొన నుత్సుకతం గడుఁజూపె; నింతలోఁ
గొందల మంది యాపె తనకున్ సరిపోవునటంచు నెంచి తాఁ
దొందర చేసి వచ్చె నసితుండను వాని యొకండు పిమ్మటన్. ౩౮

కాదని తండ్రి, శంతనుఁడె గైకొనునట్లు లొనర్చె; గూఁడె మా
మోదము నొందె సత్యవతి మోహము తీఱెను; గొన్ని యేండ్ల కా
భూధవుఁ డంతరింప నది పోలునో? పోలదో? నాక, మేదినీ
నాథుఁ డొకండు సత్యవతి నాది యటంచు గ్రహింపవచ్చెనన్. ౩౯

ఆఁగుము నేఁడు శౌచమగునంతకు, నావలఁ జూతమంచు నే
దో గికురించి భీష్ముఁ డొక వ్యూహము వన్నియు సామవాక్యముల్
బాగుగఁ బల్కి యాతని స్వభావ మెఱింగి సమస్తసంగరో
ద్యోగము చేసి చంపెనఁట ధూర్తుని; వాఁ డెవఁడో వచింపనా? ౪౦

శంతను జ్ఞాతియే యతఁడు సర్వమహీపతులందు నప్పు డ
త్యంతము పేరువొందిన మహామహుఁడౌ 'అజమీఢు' వంశ్యస
త్సంతతిలోనివాఁడఁట యసాధ్యుఁడు వాఁ డిటులయ్యె; వీరి వృ
త్తాంతము లిట్టులున్నయవి యక్కట! యయ్యది ధర్మకాలమా? ౪౧

అత్తఱి క్షత్త్రియాంగన యటంచుఁ గోలంబున బుద్ధి యుంచి యే
యుత్తము లామెఁ గోరినది యున్ గనరాదు తలంప నాపె య
త్యుత్తమ సుందరాంగి యనుటొప్పును; వ్యాసునివంటివానికిన్
మొత్తముమీఁదఁ దల్లియయి మోదము గూర్చెను నాఁటివారికిన్. ౮౨

పాఱుత కాని యామెకును బ్రహ్మను బోలెడువారు పుట్టి పెం
పారి మహర్షులై నిజమహత్త్వము జూపిరి మున్ను; దీని కా
ధారము వ్యాసుజన్మమె, వృథా కలహం బది యేల? వంశని
ర్ధారణ చేసి చూపఁగల దారియె కానఁగరాదు భూమిలో. ౮౩

ఒనరఁగ వజ్రసూచికమహోపనిషత్తున జాతితత్త్వవ
ర్ణనము కనంబడున్ సరిగ నాఁటి చరిత్రయు దిద్ది తీర్చి చ
క్కని హితబోధ చేసె; నది గాదని యెవ్వఁడు నేఁడు గుండెమీఁ
దను జెయి వైచి చెప్పఁగల దక్షుఁడు చూపునొ! చూడఁగావలెన్.

వ్యాసుఁడె కాదు పెక్కురు మహర్షులు జన్మముఁబట్టి బ్రాహ్మణా
భాసులు; వారు పుట్టుకనుబట్టియె గణ్యత నొందలేదు; స
న్న్యాసులు సాతు లెందఱొ మహామహులై తరియించి వన్నెయున్
వాసియు నొంది రయ్యది యభాగ్యులు కొందఱెఱుంగ రిమ్మగా. ౮౫

ఐతరుఁడను శూద్రమానవుఁడు దొడ్డతపంబునఁ జేసి జ్ఞానియై
పరఁగి మహర్షియై కులవిభాగము రూపఱిపోవ ప్రేని క
ధ్వరములు నశ్వమేధము లవారిగఁ జేయను సాయమయ్యె ని
ద్ధర నని 'ఐతరేయమె' ప్రధానముగా వచియించె నొక్కచోన్. ౮౬

బీజము క్షేత్ర మిట్టివి విభిన్నపథంబున వానివాని వి
భ్రాజితకీర్తిమూర్తులు విభాగ మొనర్చి ప్రసిద్ధి నొందె నీ
యోజఁ బరీక్షసేయ నిది యుక్తమొ కాదొ పురాణగాథలన్
యోజన చేసి చూడవలె నోరిమి దీక్షయుఁ బూని యెవ్వఁడేన్. ౮౭

వసువను వాని వీర్యమునుబట్టియె సత్యవతీకులంబుఁ ద
ద్వశమును దేల్పఁగాఁదగదు; దానికి క్షేత్రము చేఁపకావుటన్
విశదముగాఁగ నిట్టిదని పేర్కొన వీలును గాదు, వారివా
రి సరణి భిన్నమై యొకపరిస్థితికిన్ గడు దూరమయ్యెడిన్. ४७

నిజముగ నామె బ్రాహ్మణిగ నిర్ణయ మిచ్చిన నెట్లు సెల్లు ? న
క్కజ మగుఁగాదె క్షత్రియుని కాంతగ మాఱుట! దాని బిడ్డలున్
బ్రజలకు రాజు లెట్లయిరి ? పాఱుత కాదని రాచకన్నె య
న్నఁ జనునె దాశవృత్తికది! న్యాయ్యముగా నది పల్లెపిల్లయే. ४८

దాశకులంబువాని కది దక్కినపిమ్మట దానిఁబట్టియే
దాశుఁడు దాశరాజనుచు దర్పముతో బిరుదంబు వొంది త
ద్దేశములోన శక్తికొలఁదిన్ దమజాతిని నేలె; క్షాత్త్రమున్
బూసిన పూఁతయే యగునుబొమ్ము తలంపఁగ నిట్టిపట్టులన్. ५०

వెలయఁగ వీర్యమే కులవిభేదము సూపునటన్న మాటయున్
నిలువదు; వ్యాసమౌనికి జనించిన శ్రీశుకుఁడున్ మహర్షియై
వెలసెను; వానివైఖరి వివేకము నారయ బ్రహ్మతేజమున్
గలిగిన దొడ్డమానిసియె గాని విచిత్రము చూతమిచ్చటన్. ५१

వ్యాసుని బిడ్డలై పరఁగు పాండుమహీపతి-వాని యన్న స
న్న్యాసులు కాక క్షత్త్రియులు నౌటకుఁ గారణ మేమి ? వాని-కే
దోసము కల్గి శూద్రుఁడని దూఱు వహించెను దాసిపుత్త్రుఁడీ;
ట్లే సరిపెట్టుకొంచుఁ గథ లెన్నియొ గాసట బీసటయ్యెడిన్. ५२

అనఁగా బీజముకన్న క్షేత్రమునకే యాధిక్యముం గల్గెఁ గా
వున దాశాత్మజ బిడ్డ దాశుఁడనియే పూర్వుల్ వచింపంగఁ గా
దని యెట్లంతుము; పైగ నింకొకటి యా వ్యాసుండు సంకీర్ణజా
తిని సృష్టించియు జాతివర్గమును విస్తీర్ణంబుఁ గావించెడిన్. ५3

తల్లియుఁ బల్లెపిల్ల యిఁక దానికి నప్పటి భర్త పాఱుఁ డీ
యల్లరి 'కన్నెసంతతికి' నార్యులు పేరులు వెట్టి శాస్త్రమే
యల్లిరి దానిఁబట్టి యిఁక వ్యాసుఁడు పారశవుండో? నీచుఁడో
భిల్లుఁడో? యే నిషాదుఁడో? విభిన్నకులుండో? యెఱుంగ మక్కటా!

కాలముఁబట్టి బోయలయి కర్మము కాలియు శాస్త్రదృష్టచం
డాలురునై యనంతరము నాగరకుల్ బలె సంచరించియున్
జాలఁగఁ బేరువొంది యనిశంబు తపస్సున మున్గి నాల్గు .వే
దాలు-తదీయభాష్యములు దక్కి- మహర్షులునైరి యెందఱో. ౫౫

ఆ తెగలోని వ్యాసుఁడు మహర్షియు నయ్యు నిషాదరూపుఁడై
బ్రాఁతిగఁ బూతిగంధ మశుభంబగు వేసము వ్రాసినట్టులే
చూతుము భారతంబున; విశుద్ధచరిత్రము కల్గియున్న యే
జాతినిగాని క్షుద్రమని చప్పునఁ జెప్పుట యొప్ప దెప్పుడున్. ౫౬

ఇతనికిఁ బాండవేయులన నెక్కువ మక్కువ, దీని కారణం
బితరము కాదు, వారలకు నీతని కిట్టిది జన్మవృత్తసం
గతి సరిపోయి యొక్క తెగ కావుటె; దానను జేసి చాలఁగా
నితఁ డభిమాన ముంచి భరియించిన ఘట్టము లెన్నొ తోఁచెడిన్. ౫౭

మచ్చున కిత్తుఁ గొన్నిటి; నమాయికబుద్ధులు-పైగఁ దండ్రియున్
జచ్చినబిడ్డ లెవ్వరును సాఁకెడివారలు లేరు పాండవుల్
నిచ్చలు నెట్లు జీవితము నేర్పుగఁ బుచ్చఁగలారటంచుఁ దా
నచ్చము దీక్ష వ్రాసి దయ నారయుచుండెను వ్యాసుఁ డిమ్మహిన్. ౫౮

దిక్కదివాణ *మేదియు నధీనత తప్పిన జీవితంబుతో
నుక్కఱి పాండవేయు లొక యూరును బేరును లేక యెక్కడో
చిక్కులఁ బొక్కుచున్నతఱిఁ జెచ్చెర వ్యాసుఁడు వారిఁ జేరి మీ
యక్కఱ తీర్తు నేదియు ననర్థము రాదిఁక నన్ను నమ్మినన్. ౫౯

* నశించియు

నా యెడ మీరు సఖ్యము ననారత మొద్దికఁ జూపనేర్చి యా
యాయి 'సమస్య'లందు హృదయంబున నన్ను స్మరింతురేని మీ
శ్రేయమె కూర్తు; మీర లిఁక రేయుఁబవళ్ళును గూఢవేషముల్
వేయుచు నేకచక్రపురవీధుల భైక్ష్యము నెత్తుకోవలెన్. ౯౦

అని తలలోన నాలుకయి యాపదఁ బాపు హితోపదేశముల్
పనివడి లెస్సగాఁ దగిన 'బాధ్యత'తోఁ బచరించి వారి ప్రా
ర్థనముల నాలకించుచు ముదంబున సాఁకుచు వారి కష్టముల్
తనవిగ నెంచె వ్యాసమునితల్లజుఁ డొయ్యన నాఁడునాఁటికిన్. ౯౧

అడవులలోనఁ బాండవు లయాచితరీతి హిడంబ ప్రాపునం
బడసిన లాభ మంతకును వ్యాసుఁడె మూలము; వాని మాట ల
ప్పుడు రతనంపుమూటలయి మోదము కూర్పఁగఁ బంచపాండవుల్
కడపిరి కాల మెట్టి కడగండ్లనుసైతము నెట్టివైచుచున్. ౯౨

బకుని వధించి పాండవులు పైనము కట్టినవేళ వారివ
ద్దకుఁ జనుదెంచి వ్యాసుఁడు ముదంబున ద్రౌపది పూర్వగాథ వా
రికి వినిపించె; దానిఁ బలురీతుల వారలు మెచ్చుకొంచుఁ ద
ప్పక ద్రుపదాత్మజన్ దమకు భార్యగఁ గోరియుఁ బోయి రయ్యెడన్.

ఇట్టులు పాండవుల్ తమకు నేర్పడు లాభముమూట తల్లికిన్
గట్టిగఁ జెప్పి యా విధముగా ద్రుపదాత్మజఁ జెట్టఁబట్టఁగాఁ
బట్టును బట్టి రయ్యది - యభావ్యమటంచును బిల్లతండ్రి యా
పట్టున సంశయింపఁ దన'బాధ్యత'తీర్పఁగ వచ్చె వ్యాసుఁడున్. ౯౪

అంతకుముందె వ్యాసుఁ డిది యంతయు 'గూడుపుఠాణి' చేసి యా
కాంతను వారి కేవురకుఁ గట్టఁగఁ జూచినవాఁడు గాన, సి
ద్ధాంతము చేసి చెప్పెదరు వ్యాసు లటంచును ధర్మరాజు భూ
కాంతుని గోరె వాఁడును ముఖాముఖి నేమన లేక యొప్పినన్. ౯౫

వనవసి వ్యాసుఁ డా ద్రుపదు భాషను చక్కఁగ సంస్కరింపఁగా
ననునగు పూర్వగాథల ననంతముగా గుదిగ్రుచ్చి పల్కి వా
నిని దన శ్రోత్రమం దనదు నేరిమిఁ దెచ్చియుఁ బెండ్లి కార్య మె
ల్లను దటి తప్పకుండ సవిలాసముగా నెఱవేర్చె నత్తఱిన్. ౬౬

ద్రుపదనరేంద్రు బాంధవముతో నిటు పాండవు లాత్మరక్షణం
బపరిమితంబు కూడ్చుకొని యాలనపాలన సేయువారలై
యపుడు వికాస మంది రిది యంతయు వ్యాసుని భిక్ష; వారికై
తపమును ధారవోసె మునితల్లజుఁ డయ్యనఁ బ్రేమ సూపుచున్. ౬౭

జూదములోన నోటమిని జూచి 'యుసూరు' మటంచుఁ బ్రాభవం
బేది యరణ్యభూములకు నేఁగిన పాండుతనూజులన్న న
త్యాదర ముంచి వ్యాసుఁడు తనంతనఁ దా నరుదెంచి వారికిన్
బాధలు వోవుతీరున శుభం బొడఁగూడెడి త్రోవ చూపెడిన్. ౬౮

ద్వైతవనంబులోఁ గుదురుపాటునఁ బాండవు లున్నవేళ నే
వో తమ బుద్ధి కందిన కుయుక్తులు వన్ని సుయోధనాదులుం
జేఁతలు సూపఁగాఁ దలఁపఁ జెచ్చెర వ్యాసుఁడు ధార్తరాష్ట్రిలన్
గూఁతలు వెట్టి పోయె నిది కూడదు మీకని నొక్కి చెప్పుచున్. ౬౯

ఒకతఱి నేదొ యాపద సుయోధనుఁ డుద్ధతిఁ జేయునంచు వా
రికి వినిపించి వ్యాసుఁ డొనరించె సురక్షితమార్గ మంతఁ గా
మ్యకవనమందుఁ జేరియుఁ బ్రమాదము నొందక పంచపాండవుల్
సుకముగ నుండి రిట్టివియె చూవె మహర్షి యొనర్చు సాయముల్.

అరయఁగ హస్తినాపురికి నంతగ దూరముగాని 'ద్వైతమం'
దిరవుగ నున్నఁ గౌరవుల కెప్పటికైనను గన్నుకుట్టునో?
పొరయునొ క్లేశ! వారి పొరపొచ్చముఁ జేసి యటంచు వ్యాసుఁ డే
వుర నటనుండి 'కామ్యకము' వోవఁగఁ జేసెను దూరదృష్టితో. ౭౧

కౌరవులన్ జయింప మొనగాఁ డెవఁడో తనపక్షమందు నం
చారట మంది ధర్మజుఁ డహర్నిశమున్ బెదరంగ వ్యాసుఁడుం
జేరి తదీయబుద్ధికి విశేషము ధైర్యము కూర్చు లెస్సగా
నారయు వారి నెల్లర ననంతకృపామతి నెల్లవేళలన్. ౭౨

సంజయు రాయబారపుఁబ్రసక్తిని దెచ్చి సభాముఖంబులో
నం జనవొప్ప, సర్వకురునాశము తప్పదు-పాండవేయులం
దుం జవసత్త్వముల్ పెరిఁగెఁ దోడనె మీ రటు వోయి ధర్మరా
జుం జనవంద్యుఁ దేవలయుఁ జూవె యటంచును బల్కె వ్యాసుఁడున్.

యుద్ధములో సుభద్రతనయుండు గతించినవేళ ధర్మజుం
డుద్ధతి మాని శోకమున నూఱట దక్కిననాఁడు వ్యాసుఁ డా
పద్దశ రూపు మాయఁగల భంగి నెఱుంగఁగఁ జేసి ధైర్యమున్
బుద్ధికిఁ గూర్చి రాజ్యమున మోహము పుట్టఁగఁ జేసె వానికిన్. ౭౪

అన్న యటం చెఱుంగక మహామహితాత్మునిఁ గర్ణుఁ జంపి యా
బన్నము తీఱ నా వెనుకఁ బాప మెఱింగిన ధర్మరాజు శో
కోన్నతిఁ గ్రిందు మీఁదయి యయుక్తముగాఁ జరియించువేళ న
త్యున్నతశాంతిఁ గూర్చి యితఁ డోపిక వ్రానియుఁ బ్రోచె నాతనిన్.

అగ్రసుతుండు వోయి తనయా! యని యావురుమంచు నేడ్చి శో
కోగ్రతఁ జిక్కి మిక్కిలియు నూర్చుచుఁ గోపము నందు నంధునిన్
నిగ్రహశక్తియుక్తునిగ నేర్పుగఁ జేయను వ్యాసమౌనియే
ప్రాగ్రసరుండు ధర్మసుతుపంపునఁ బోయెను వానిపజ్జకున్. ౭౬

వేదుఱు గ్రమ్మి ద్రౌణి యవివేకముచే శిశుహత్య సేయ నా
బాధకుఁ దాళఁజాలక యభాగ్యుని వానినిబట్టి పాండవుల్
మోఁది పరాభవంబునను ముంచినవేళఁ దదీయ 'రత్నమున్'
గాదని పీఁడు పాండవులకై విడిపించెను మధ్యవర్తియై. ౭౭

అందఱుఁ బుత్రు లాహవమునందు గతింపఁగ డెంద మెంతయున్
గొందల మంద ధర్మజుని కుత్సితభావముగూర్చి రోసి యా
క్రందనముం బొనర్చి తమకంబున ధర్మజు శాపదగ్ధుఁ జే
యందలపెట్టు వృద్ధ కది న్యాయము కాదని నేర్పె వ్యాసుఁడే!! ౭౮

ఘోరమహావమానమునఁ గూలిన కౌరవవీరవర్గమున్
సారెకు సంస్మరించుచు విచారమనంబున వారి భార్యల
వ్వారిగ ధర్మరాజును నెపంబిడి తిట్టెడి తిట్లు విన్న నె
వ్వారును సైఁపలేరయిరి; పాపము! ధర్మజు కర్మ మిట్టిదే!! ౭౯

ఐనను వారి కెవ్వరకు నాప్తులు లేరు, కడింది బెంగయున్
బూని విరక్తచిత్తలయి పూర్తిగఁ జత్తురటంచు నెంచి వాఁ
డే నరకంబు సైఁచె; నది యేమి విచిత్రము! వారిలోన నే
మానిసిగాని చావదు; ప్రమాదము తోఁచెను జేని కయ్యెడన్. ౮౦

వ్యాసుఁడు చేరి మెల్లగ నెపంబును బూని, నిరీహబుద్ధితో
గాసిలు వారి కెల్లర కొకానొక మోహము సూపి వారలం
బాసిన భర్త లెల్లరను బాగుగఁ జూపెద నంచు గంగపాల్
చేసెను వారి నందఱను జెచ్చెరఁ జిత్రవిచిత్రవృత్తిమై. ౮౧

ఇదిగో యుద్ధము తప్ప దెవ్వరికి నే యే చుట్టముల్ పక్కముల్
కుదురై యుందురో? చూచుకోవలయు; నే కోశంబునన్ శాంతి లే
దిది ముమ్మాటికి సత్య మెవ్వరికిఁగానీ దీని నాఁపంగరా
దు, ధరాభారము తీఱునేమొ యనుచున్ దుఃఖింపఁగా వ్యాసుఁడున్.

ఒకనాఁ డా ధృతరాష్ట్రుఁ జేరి సమరం బుగ్రంబుగా నెల్లవా
రికి సాఁగున్ మఱి నిన్నుఁబోలు నృపులీ రీతిన్ విచారించి యే
రికి లాభం బొడఁగూర్ప వీలగును? నిర్వీర్యుండవై జాతి కం
తకు నైచ్యంబు నొనర్పఁగావలదు వత్సా, చెప్పెదన్ విందువా!! ౮౩

యశమో మృత్యువో కొందుమంచు సమరవ్యాపార నిర్నిద్రులై
వసుధేంద్రుల్, మనవారి నందఱను నే వర్ణింతు నుద్గ్రంథమున్
బస మీఱం బ్రకటింతు దుఃఖపడఁగా భావ్యంబు కా దిద్ది నీ
వశమా! యాఁపఁగ? నాదుమాట వినుమా! పాటింపుమా క్షాత్రమున్.

అని మూఁడేండ్లు కడంగి తద్విషయమై వ్యాసుండు గ్రంథంబుగా
నొనరంజేసెను గాని దాని నొకనాఁ డొక్కింతయున్ వాని వ
ద్దను విన్పింపఁడు ధార్తరాష్ట్రులకుఁ దద్గ్రంథంబులోఁ గీర్తి మా
పిన ఘట్టంబులు పెక్కు లుంచి యమితద్వేషంబు చూపెట్టుటన్. ౮౪

ధృతరాష్ట్రాదులు పోవఁ బాండవులె తద్దేశంబు నేలంగ భూ
పతులై వచ్చిననాఁడు మోజువడి తద్భాగ్యంబు వర్ణించుచే
గతిగా నెంచిన వ్యాసభారతము లోకంబందు నుద్గ్రంథమై
హితమున్ గీర్తిని గూర్చెఁ బాండవుల కెంతే వింత సంధిల్లఁగా. ౮౫

'జయమ'ను గ్రంథమున్ దొలుత సంజయుఁడైనను జూడఁడాయె; న
న్నియు నొక పక్షపాతమున నించి రచించిన వ్యాసగ్రంథ మం
తయు నితఁ డాలకించినఁ బ్రధానముగాఁ గల పక్షపాతబు
ద్ధియు బహిరంగమై తగిన తీరుగఁ దత్త్వ మెఱుంగఁ బోలదో!! ౮౬

స్వయముగ యుద్ధరంగమున సర్వవిశేషము లానుపూర్విఁ గాం
చియుఁ గథలన్ని ముచ్చటగఁ జెప్పిన సంజయుఁ డిట్లు పాక్షికం
బయి వెలువడ్డ భారతము నంతయుఁ జూచిన సమ్మతింపఁడన్
భయమున వ్యాసుఁ డా పనికిఁ బాల్పడియుండును బాప మయ్యెడన్.

ఇన్నివిధాల సాఁగి యది యెబ్బెటికంబుగఁ దోఁచి యా పరీ
క్షిన్నరపాలపుత్త్రుఁడు నిసీ! యని రోసెను వ్యాసుఁ జూచి, కా
కున్నఁ గథావిధానమున నుద్విఘులఁ బాఱిన రాజు వ్యాసునం
దున్న విశేషదోషముల నుద్దవిడిం బ్రకటించియుండునా! ౮౭

అనఁగా నిట్లనె వాఁడు వ్యాసునకు నయ్యా, నీవె యీ ఘోరమా
రణముం జేసినవాఁడ వట్టితఱి నా రాజేంద్రులం జేర్చి వా
రిని సన్మార్గములోన నుంచితివె? తచ్ఛ్రేయంబు కాంక్షించి కా
దనినన్ యుద్ధ మదేల సిద్ధమగు? నీ యన్యాయ్య మిట్లయ్యెనా!! ౯౦

వారికి వీరికిన్ బలు వివాదములన్ ప్రచరించి ద్వేషముం
గూరిచి యొక్క పక్షమునఁ గూర్మియుఁ జూపి కథాక్రమంబు నీ
తీరుగ సాఁగిపో నడపి తిప్పలు తెచ్చితివయ్య సర్వథా
శ్రీరమణేంద్ర జాతికిని; దేవరహస్యము నీమతత్త్వమే. ౯౧

వ్యాసుఁడు రాణివాసమునయందలి పొత్తున బ్రహ్మచర్యముం
బాసెను దానిమూలమున భ్రష్టుఁడె యయ్యెను: దల్లియానతిం
జేసియె చేసె నిట్టిదని చెప్పఁగవచ్చును కొంద ఱైన నా
దాసినిగూడఁ గూడుమని తల్లి వచించియుఁ బంపియుండెనా? ౯౨

ఎఱుఁగక కూడెనంచు వచియించుట యొప్పదు వాని చేష్ట లం
దఱకును స్పష్టమే; యొకవిధంబుగ వాఁ 'డవకీర్ణి' యన్న చోఁ
బూరయదు దోస మావలఁ బ్రబుద్ధుఁడు వీఁ డొకనాఁడు వహ్ని కా
ర్యరతుఁడునై విచిత్రమగునట్టి పరిస్థితిఁ దెచ్చె నొక్కెడన్. ౯౩

అప్పుడు చేతిలో నరణి నాతఁడు గైకొని శాస్త్రదృష్టిలో
నొప్పుగఁ దా-మథించుచును నోర్తుక యచ్చట గోచరింపఁగాఁ
దప్పని యెంచ కాపెను ముదంబునఁ గోరఁగ నామె యప్పుడే
యొప్పిన చిల్కయై యతని కువ్విళు లూరఁగఁజేసెఁ బేరిమిన్. ౯౪

తుది కతఁ డాఁగలేక, తన దుందుడుకుం జవి చూపి యంగజుం
డెద గుటివెట్టి యేయఁ దరియింపఁగఁజేయు పవిత్ర కార్య మ
న్నది గుటిలించియున్ హృదయమందలి దోసముఁజేసి వీర్యమున్
గుదురుగ వైచె రోఁతగ మొగంబున సిగ్గు 'సెరంబు' లేకయే. ౯౫

అది గుజ్జువెట్టినట్టులు మహాకసాలో బడి పుత్త్రరూపమై
పొదలెను-వాఁడె శ్రీ శుకతపోనిధి-యయ్యది యట్టులుండె-నీ
విధమున వ్యాసమౌని యవివేకము సూపి యధర్మకార్య మ
య్యెదనుసఁ జేసె; వీఁడొక మహాత్ముఁడె? వేదవిభాగకర్తయే? ౯౬

ఇఁకఁ దరువాతిజీవితము నీతఁడు రోఁతఁగఁ బుచ్చెఁ గాశిలో
సకలజనంబు ద్వేషము-నసహ్యపుభావము చూపె వీని వృ
త్తికి, నితఁ డాగ్రహంబు-నవిధేయత వ్రాని మహేశునంతవా
నికె యపచార మొక్కతఱి నెట్టనఁ జేయఁగఁజొచ్చె నచ్చటన్. ౯౭

కాశీపట్టణమందుఁ దిండికొఱకై కారాలు మిర్యాలుగా
వ్యాసుం డొక్కవిధానఁ జేసెఁ దన విద్యాబుద్ధు లేమైనవో
గాసిం జెంది యమాంత మచ్చటి మహాకాశీవిశాలాక్షి వి
శ్వేశాదుల్ నిరసించి ఛీ యనఁగ నెంతేఁ జింతచేఁ బొక్కుచున్. ౯౮

ప్రజ లది గాంచి నిచ్చలును వ్యాసుని శిష్యుల సేవగించి య
క్కజముగ వారి భిక్ష కొఱగాదని పెట్టరు, కాశిరాజు నీ
కుజనుని సైఁపలేక తనకుం గల దర్పముఁజేసి 'దక్షిణా
దిజనపదంబులోఁ దఱుమ దీనతఁ బోయెను బాప మొంటిగా. ౯౯

వాఁడు వసించు కాశిపురి భ్రష్టమె యాయెఁ దదీయకీర్తియుం
బాడయి వన్నెవాసి యలుసంబయిపోయెఁ దదీయజీవితం
బోడయి నీరసించెఁ దుది కొక్కఁడె యెక్కడొ బిక్కచిక్కి నా
నాఁడు తపించె నందు రిది న్యాయమె యట్టి నికృష్టజీవికిన్. ౧౦౦

ఇది స్కాందంబున నున్నగాథ, యతఁడే యిద్దాని వర్ణించె న
న్నది యెట్లొప్పునొ? వ్యాసుపేరట మహావ్యాప్తిం దగం జెంది నె
మ్మదిగా సర్వపురాణముల్ వెలసెఁ దన్మోనీంద్రశిష్యాళి యి
ట్టిది సృష్టించిరి కొంద ఱింతయును సత్యంబంచు శాసించుచున్. ౧౦౧

అన్నియు వీఁడు వ్రాసి పరమార్థ మెఱుంగఁగఁ జేసె వీనియం
దున్న విశేషమే యిది, మహోన్నతబుద్ధి యటంచు గాథ లె
న్నెన్నొ ప్రపంచమందు వెలయించిరి కాని తదీయవాస్తవం
బెన్న నసాధ్య మెవ్వరికి నేని విచారణ చేసి చూచినన్. ౧౦౨

భారతమంతఁ బూర్తిగను వ్రాసియు వ్యాసుఁడు చిత్తమందు వి
స్తారము చింత గూరి యవశంబగు స్థితి వొంది కుందఁగా
నారదుఁ డేగుదెంచి తగునా? యని దివ్యహితోపదేశ మ
వ్వారిగఁ జేసి భాగవతభాగము వ్రాయుమటంచుఁ జెప్పినన్. ౧౦౩

చిత్తమటంచు వ్రాసి తన చిత్తములోని విచారభార ము
వ్వెత్తుగఁ దూలిపోవ నవివేకము మాపజి శాంతి దక్కఁ గొం
గ్రొత్తగ జ్ఞానముం బొలయ రోసిన జీవిత మెల్ల శాంతిలో
హత్తుకొనంగఁ జేసికొని వ్యాసుఁడు దానఁ దరించె నిమ్ముగా ౧౦౪

పాయని భక్తితోఁ గుదురుపాటుగ భవ్యకవిత్వయుక్త రా
మాయణమున్ రచించిన మహర్షి తరించెనుగాని స్వాస్థ్యముం
బాయఁడు; వీని జన్మమున భారతసంహిత కూర్చు దోస మి
ట్లాయెను-వీఁడభాగ్యుఁడె; స్వయంకృత దోషము తప్ప దేరికిన్.

వారును వీరు రాజ్యమున వంతులు గిట్టక హక్కుభుక్తముల్
కోరుచుఁ బోరు ఘట్టమునకున్ జనుదెంచియు వ్యాసుఁ డేదియో
తీరుపు సెప్పఁజూచుఁ గడుతియ్యనిమాటలఁ గాని వానికిం
గౌరవులన్న గౌరవము కన్పడ దెన్నఁడు లేశమేనియున్. ౧౦౬

పుట్టినఁదొట్టి పాండవుల బుద్ధులె దొడ్డవి ధార్తరాష్ట్రిలం
దట్టివి బొత్తిగా నెవనికైనను గన్పడవంచు వాదమున్
గట్టిగఁ జేసి పైగఁ దన గ్రంథము నంతయు నా 'పునాది' పైఁ
గట్టియుఁ జూపె నట్లగుటఁగాదె వికారము కల్గెఁ బిమ్మటన్. ౧౦౭

ఇది తృతీయాశ్వాసము

# చతుర్థాశ్వాసము

## భారత ప్రశస్తి

వేదములందు నొక్కటిగ విజ్ఞులు మెచ్చుటె కాదు భారతం
బాదిని ధర్మశాస్త్రమని వ్యాసుఁడె 'కట్టడ' చేసె దీనికిన్
భేదము లెన్నొ కన్పడి విభిన్నఫలంబులు సూపు వాస్తవం
బేదియొ చూడఁగా వలయు; నిట్టిది తప్పునఁబోల దేరికిన్. ౧

'రామకథామృతంబు'ను భరంబగు వేడుక వ్రాని శిష్టులా
గామిశుభోదయంబునకుఁ గారణమంచుఁ బఠించి మోక్షల
క్ష్మీమహితాత్ము లయ్యెదరు; చిత్తము శాంతి యొనర్చు కావ్యమై
యీ మహి నొప్పు దీని నుతియింపగ ధన్యత వొందు జన్మమున్. ౨

భారత మెవ్వ రప్పగిదిఁ బాయని భక్తి ప్రపత్తి చూపి యిం
పారఁ బఠింప రేల? యది యట్టి పవిత్రము కాదు కావునన్
సూరిజనంబు దాని నొక సుందర కావ్యములందుమాత్రమే
చేరిచి మోజు సూపుచును జిత్తవికాసము నొందు నిమ్ముగా 3

భగవద్గీతకుమాత్ర మిచ్చి రధిక ప్రాముఖ్య మా పైని యం
తగ నే ఘట్టము చూడఁగాఁదలప రద్దానన్ మహాభారతం
బు గణింపందగు మోక్షశాస్త్రమగునే? పూర్వుల్ 'విరాటంబు' నే
పుగ వర్షంబును గోరియున్ జదివిరే పో! శిష్టులున్ మెత్తురా! ౪

స్త్రీలకు శూద్రజాతులకు శ్రేయము కూర్పను మోక్ష మీయ వే
దాలు నిషేధమున్ బలికె దానను లోపము తీఱ లాభముల్
చాలఁగ నీయ భారతము చాలునటంచు వచించియుండుటన్
దేలదె దీని సోయగము దివ్యమహామహిమంబు సర్వమున్. ౫

ఆరయ లక్షశ్లోకములు వ్యాసుఁడె వ్రాసినయట్ల శ్రీ మహా
భారత మద్దియే యనుచుఁ బల్కుదు రజ్ఞజనంబు; దాని కా
ధారము కానరా దిఁక నిదానముగాఁ బరికింప వ్యాసుఁడే
భారతకర్త కాఁ డతని వంతు 'జయం' బనుభాగ మొక్కటే. ౬

వైశంపాయన—సౌతులన్న మును లీ వ్యాసర్షి కావ్యంబు స
ర్వాశావ్యాపృతమైనదానిగ మహాయత్నంబుతోఁ జేసి తా
మా శేషంబును బూర్తిచేసిరని దృష్టాంతంబులున్ జూతు మిం
కే సందేహము లేదు కల్పితము గా దీ వార్త సర్వాత్మనా. ౭

అది యేమో మఱి తెల్గుభారతము నీ యాచారమే కల్గి యు
న్నది చిత్రంబు, కవిత్రయంబనుచుఁ దన్నామంబు సర్వత్ర పెం
పొదవెంగాని విశేష మొండు కల దీ యుర్విన్ మహా వేద మి
య్యది యన్నన్ సరిపోవునా ? తెలుఁగులో నాద్యంతమున్ జూచినన్.

కవితారీతినిబట్టి దీని విలువన్ గైవారముం జేయఁగా
నెవరున్ గాదనఁబోరు గాని యిది యే యే యంశముల్ సర్వమా
నవమోక్షంబున కాస్పందబులని విన్నాణంబుగాఁ జెప్పి చూ
పె విచారింపఁగ వానిఁబట్టి యది యొప్పింపంగ దుస్సాధమే. ౯

ఐదవవేద మన్న నుడి యాంధ్రమునలో సరిపోదు బొత్తిగా,
వేదములందు నిట్టివె వివేకము కూర్చెడి త్రోవ లున్న వం
చాదిమహర్షులే పలికిరన్నను జాలును దానిగూర్చి యే
వాదము సేయఁగాఁదగదు, వాసినిసైతము చూతు మిట్టులే. ౧౦

భగవద్గీతను దెల్గు చేసిన మహాపాపంబు రూపెత్తి విం
తగ నాశం బొనరించు వంశమని యే దౌర్భాగ్యులో యాదిలోఁ
దెగ శాసించుటఁ జేసి దాని దరికిన్ దిక్కున్నయే పోవఁడ
య్యోఁగదా! వేద మటంచు దాని గుఱిగా నెవ్వార లేఁ జూతురా? ౧౧

పైగా మాటికిమాటి కందు బహుళప్రక్షిప్తభాగంబులున్
సాఁగన్ జూచియు 'నర్థవాదముల' నిస్సారంబు గుర్తించి యా
భాగంబున్ మఱి వేదభాగముగ నెవ్వాఁ డొప్పుకోనేర్చు నిం
తే గోరంతలు గొప్ప చేసి భువిలో నీతిరు గావింతురా? ౧౨

కేవలపశుపాతమునఁ గ్రిందును మీఁదును జేసి పుట్టుకల్
చావులు చాలఁగా నొగి విచారపరిస్థితులందుఁ గూర్చి దు
ర్భావము ప్రోదిసేసి యలుపంబుగ నీతిని ద్రోసివైచెఁ గా
దే! వివరింప భారత మదెట్టులు పంచమవేద మయ్యెనో! ౧౩



# సాంఘిక విప్లవము

ద్వాపరమందు సర్వజనధర్మము లిద్ధరఁ దాఱుమాఱులై
కాఁపరి లేని గొఱ్ఱియలకై పడి దిక్కులు పట్టి మార్గముల్
చూపెడివాఁడు లేక కనుసూటిగఁ బోయినపోక పోవు న
ట్ల్యైపుల విచ్చిపోవుచు వివాదములన్ బచరించె హెచ్చుగా ౧

ఆరయ నార్యధర్మము లవన్నియు సంకరమై మహాచమ
త్కారముగాఁ బెనంగుచు వికారగుణంబులు రేఁపి జీవితా
ధారములైన వృత్తులు యథాయథలై నసి లేక రూపజన్
జాతి కృశించి చిత్రమగు జాతుల సృష్టి యొనర్చె స్వేచ్ఛగా. ౨

అంతను ముందుఁ బ్రాభవము లందిన యార్యుల జాతి-సంఖ్యలోఁ
గొంత కృశించి చిక్కులను గూర్చుటఁ జేసి యనార్యకాంతలన్
వింతగఁ బెండ్లియాడుటయు వేఱిమి వుట్టుటయున్ విచిత్రవృ
త్తాంతము లెన్నొ యుప్పతిలె దానను మిశ్రమజాతు లేర్పడెన్. ౩

పోరును ఘోరమై వెడలి పూరుషజాతి నశింప జాతి కా
ధారము నైన సంతతి ముదంబునఁ బొందను వీలు లేక యె
వ్వారినొ లాఁతివారలను భర్తలు గాఁగ 'నియోగపద్ధతిన్'
జేరి విచిత్రసంతతిని జెందిరి కాంతలు ద్వాపరంబులో. ౪

తక్కువజాతివాఁడు తన దర్పముఁ జేసియొ వేఱు కారణం
బొక్కటి యుండియో తనకు నున్నతజాతిది భార్య కాఁగ నా
ఫక్కిని బిడ్డలన్ గనఁగ వారు మహామహులౌట-వారి కే
చిక్కులు లేకపోవుట విశేషముగాఁ గనుపించు నత్తఱిన్. ౫

'క్రీతలు' పెక్కు రాత్మజులకీతిని సంఘములోఁ దలిర్చి ని
ర్భీతిగఁ గాఁపురంబు లొనరించిరి వారికి సాంఘికంబుగా
సైతమె కాక యన్నిటను జాలిన గౌరవమున్ బ్రపత్తియున్
బ్రీతిగఁ జూపి రెల్లరు; విభేదము రూపఱిపోయె నల్లెడన్. ౬

సంకరజాతు లెల్లెడల సాఁగియు నార్యుల మచ్చ మాపనుం
జంకక నవ్యపద్ధతులు సంఘములో నొగిఁ జేర్చి పేర్చి యే
వంకలు లేక తాము తమ వర్గమె శిష్టులువోలె ధర్మముల్
పొంకముగా సమన్వయపుబుద్ధిని నేర్పుచు మించి రన్నిటన్. ౭

యువతులలోఁ బవిత్రతయు నుక్కిరిబిక్కిరియై వినూత్నసం
భవములు పెక్కులయ్యెఁ దమపాటికిఁ దామె స్వయంవరంబుగా
నెవరినిగాని కూడుటకునేనియు జంకని దుర్విపాకమున్
భువి నొనఁగూడి విప్లవము పుట్టెను నాఁడె విచిత్రధోరణిన్. ౮

ఎవఁ డే వర్ణమువాఁడొ చిహ్నములుగానీ లాఁతిమార్గంబుగా
ని విచారింపఁగ లేవు — సర్వజనముల్ నేమంబులన్ బాసి పూ
ర్తివిపర్యాసము నొంది రంచు నహుషున్ ధీశాలి ప్రశ్నించెఁ బాం
డవశ్రేష్ఠుం డది నాఁటి ధర్మముల 'బండారంబు' చూపెట్టదా? ౯

ఆవల యుద్ధరంగమున నర్జునుఁడున్ దన సందియంబు లే
వేవియొ విన్నవించుకొని యిట్టివి సైతము ముచ్చటింపఁగా
నా విధమైన ప్రశ్నమున కా యదువీరుఁడు నవ్వి స్త్రీలకై
యీవు విచార మొందఁదగునే? యిది యార్యులు మెత్తురే! యనెన్.

ఆరయ నార్యనిందితమునై యశుభంబగు బుద్ధి యెవ్విధిన్
జేరెను నీకు, నవ్వరె యిసీ! యని పెద్దలు విన్న; స్త్రీల సం
సారము గుట్టుమట్టులు విచారము సేయఁగ నార్యజాతు లె
వ్వారలు నొప్పుకోర నెడి వైఖరి నీ వెఱుఁగంగఁ బోలదా? ౧౧

అని యీ యర్థము వచ్చు నుత్తరము-తద్వ్యాఖ్యానమున్ బల్కు కృ
ష్ణుని యత్నంబునఁ గ్రీడి యా విషయమై సుంతైన మాటాడనో
పనివాఁడయ్యె; స్ఫురించియుండు మదికిన్ భావ్యంబు కా దట్టి ప్ర
శ్నను వేయన్ దనకంచు సత్యవతి సంతానంబులోఁ జేరుటన్. ౧౨

## సాంఘిక విప్లవము

తన వంశంబున నల్వు రంగనలు తద్దౌర్భాగ్యశీలంబు నొం
దిన యంశం బది తోఁచి తక్కుఁగల సందేహంబులే కృష్ణమూ
ర్తిని బ్రశ్నించి యెఱింగె, యజ్ఞతికిఁ నే రీతిన్ ననున్ నైతువో
యని యా పార్థుఁడు దోషిపోలె నతనిన్ బ్రార్థించె నత్యంతమున్.

దానినిబట్టి సంకరవిధానము జాతులలోన నెట్లు స
మ్మానము వొందెనో తెలియు; మంచిదొ! చెడ్డదొ! నాఁటి ధర్మ మా
మానవు లాచరించి; రవమానముగాఁ బ్రకృతంబు సూచు సం
తానము లెల్ల నప్పుడు ప్రధానములై పొలుపొందె నెల్లెడన్. ౧౪

అనఁగాఁ బెండ్లికి ముందె మోహపడి కన్యారత్న మే యందగా
నినొ-యాహ్వానము సేయవచ్చు, మదిలో నెయ్యంబు నిండార నా
తని ప్రేమింపఁగవచ్చు నిచ్చకొలఁదిన్ దాంపత్యసౌఖ్యంబు పొం
దను సంతానము చెందనుం దగిన యా ధర్మంబు లా నాఁటివే. ౧౫

మగఁడు గతింప సౌఖ్యమును మానక బిడ్డలఁ గన్న కాంతలన్
దగదని మందలించిన విధం బది కానఁగరాదు నాఁడు పొం
దుగ నది ధర్మమన్నటులె తోఁచి మెలంగినవార లెందఱో
జగమునఁ గానుపింతు రిది సత్యము; నేఁడది పాడుధర్మమే. ౧౬

సంతతిఁ గోరి యెవ్వతెనొ చప్పునఁ గౌఁగిటఁ జేర్చి యాపె వృ
త్తాంత మెఱుంగకున్నను ముదంపడి వాడుకొనంగవచ్చుఁ దా
నింతగఁ జేరి యక్కఱయు నిమ్మగఁ దీఱిన వెన్కఁ బాప మా
కాంతను బాసి పోవుటయుఁ గద్దు, విచిత్రము తత్ప్రవృత్తియున్. ౧౭

ఇయ్యెడ నొక్కగాథ వచియించెదఁ బూర్వపురాణమందుఁ దా
తయ్యలు వ్రాసినట్టిదె యథార్థముగా నది వర్ణసంకరం
బెయ్యెడ నెట్లు లేర్పడి మహిం జిగిరించెనొ నాఁడు నాఁటి క
న్యాయ్యములై యనాదరము నందెనొ చక్కఁగఁ దేలిపోయెడిన్. ౧౮

రచన:—17-11-1946

# శ్వేతకేతువు

ఒక్కఁడు శ్వేతకేతువను నుత్తమమానిని కలండు విద్యలో
మిక్కిలి యారితేఱిన యమేయమహామహిముండు జ్ఞానముం
జక్క గడించి నాఁటి 'పరిషత్తుల'లో వివదించి పేరు పెం
పెక్కినవాఁడు; వాఁడు వచియించిన దంతయు ధర్మశాస్త్రమే. ౧

ఆపస్తంబుఁడు ధర్మసూత్రములలో నత్యంతమేధావిగా
నీ పుణ్యున్ స్మరియించు వీని మతమే యిచ్చున్ బ్రమాణంబుగా;
లోపం బేమిటఁ గానరాని భువనశ్లోకుండు వేదర్షి వి
ద్యాపారంగతుఁ డీతఁ డెంతయును విఖ్యాతుండు సర్వాత్మనా. ౨

అది జనమేజయాహ్వయధరాధిపుఁ డేలెడికాల మాతఁ డొ
ప్పిదముగఁ జేయు యాగముల వీఁడె సదస్యుఁడునై విశిష్టతన్
బొదలెను; వీని ప్రాభవము పూర్తిగఁ బంచమవేదమందు న
భ్యుదయముతో వెలింగె నది యువ్విళులూరఁగఁ జేయు విన్నచో. ౩

వీని పితామహుం డమితవిజ్ఞుఁడు; తండ్రియుఁ బేరుగన్నవాఁ
డైన మహర్షి యొక్క దినమందు సుపుత్త్రుఁడు శ్వేతకేతువుం
దానును గూరుచున్న తఱుణంబున నెవ్వఁడొ బ్రాహ్మణుండు రాఁ
గా నతనిం గడుంగడు సగౌరవదృష్టిని సత్కరించినన్. ౪

# శ్వేతకేతువు

అతఁడును వారి మన్ననల నందియు నయ్యెడ సంచరించు నొ
క్కతెను సురూప-స్నాతయగు కామినిఁ గాంచి మనంబు వేదనం
గుతకుతలాడ నామె తనకున్ సతి గాఁగఁ దలంచి దాని సం
గతి కుబలాట మంది పరకాంతగఁ జూడక చేయి పట్టినన్. ౫

ఇరువురుఁ జూచి రట్టియెడ హేయ్యపుకృత్యము వారిలోన నొ
క్కరువుఁడు భర్త; యాత్మజుఁడు కాంతకు వేఱొకరుండు-వాఁడె య
చ్చెరువును బొంది తోడనె యిసీ! యని బ్రాహ్మణు మందలింపఁగా
దొరఁకొనెఁ; దండ్రిమాత్ర మది దోసముగా గుఱుతింపఁ డక్కటా!

ఆలన పాలనం బెడలి యడ్డము కొట్టఁగఁ బోవు గొడ్డుగా
నేలినవాని ముందర నుపేక్షఁగఁ బోయెడి దుర్విదగ్ధ ని
ల్లాలిని జూచి కిమ్మనఁ డయారె! యిదేమని పల్కఁ డంత ను
*ద్దాలకుఁ డిట్టి వప్పుడు విధాయకకృత్యములంచు నెంచియున్. ౭

కొడుకునె మందలించి, యది కూడని ధర్మము గాదు-శాస్త్రముల్
నుడివినదానిఁబట్టి యది నూతనమైనది గాదు పెద్ద లె
ప్పుడు మరియాద సూపెడి ప్రభూతసనాతనధర్మమే యగున్
బుడబుడ వాని నేమనకు పుత్త్రి, యదల్చినఁ బుట్టి మున్గదా? ౮

ఆవులువోలెఁ గాంతలు 'సనావృత'లన్న దెఱుంగుమయ్య యీ
భావ మనాదినుండి మనవారి సనాతనధర్మమయ్య నీ
కీ విధ మబ్బురంబు జనియింపఁగఁ జేసెను గాని పుత్త్రి, మే
మేవియుఁ గ్రొత్తగాఁ దలఁప మిట్టివి మాకు సనాతనంబులే. ౯

ఆఁడుది-యొక్క మానవుని కన్నది చెల్లదు; వారివారికిం
గూడిన తెన్నుగాఁ గలియఁగోరిన దోసమటంచు నెవ్వరుం
జూడరు; పూరుషుం డొకఁడు సుందరి నొక్కతె బిడ్డకోసమై
కూడినఁ గాదుకూడదనఁగూడదు; పాపము పైగఁ బల్కినన్. ౧౦

* శ్వేతకేతువు తండ్రి

అని యా తండ్రి యదల్చినన్ గొడుకు తా నావంతయున్ జంకు గొం
కును భావంబున లేక యాఁగొనక నాకుం దృష్టి గానట్టి నీ
తిని నే నొప్పను బ్రహ్మ చెప్పినను నా తీర్పేదియో తేల్తునం
చును దోప్తోఁ 'బరిషత్తు' కూర్చి మును లెచ్చోనుండియో వచ్చినన్.

నలువురు సేరి ధర్మపరిణామముపట్టునఁ దీర్పు సెప్పఁగాఁ
గలిగినవాఁడు వేఱొకఁడు కాదు, సభాసదు లెల్లఁ గోరఁగా
వలసిన దిప్పు డీ చిఱుతవానినె యంచును శ్వేతకేతునిన్
నిలిపిరి వాదరంగమున; నిల్చియు నాతఁడు వల్కె నిట్టులన్. ౧౨

ఒక మర్యాదకు నంద ఱొప్పుకొనియే యున్నన్ బ్రజానీకమూం
సుకముం బొందును, లాభనష్టములతోఁ జూడంగ భావ్యంబు; జా
తికి శ్రేయంబును గూర్పఁగావలయు నీతిన్ రీతిఁ గాపాడుచున్;
మొకమోటంబది లేక తేల్చెదను మీ మ్రోలన్ మహాధర్మమున్.

ఋతువున నున్న కాంత నెవఁడేనియుఁ బొందను వీలు కల్గి సం
తతిఁ బడయంగ శాస్త్రములు తప్పని చెప్పనినాఁడు మానవుల్
క్షితిఁ బశుజాతికన్నఁ బరిశీలన సేయఁగ నీచులై యనా
రతము పరస్పరంబు బవరాన మునింగియు బ్రుంగి క్రుంగరే! ౧౪

ఎవతెనొ కంటి కింపయిన యింతిని గోరఁగ నాపె వాని చే
రువ కరుడేఱుటే కరము రోఁతగ నెంచిన-వాఁడు దాని గా
రవమును జూడ కామె నొక రజ్జువుతోఁ దెగబాఁది త్రోవ కా
యువతిని దెచ్చి కూడుటయు నొప్పునె! మానవజాతి కక్కటా!! ౧౫

బృహదారణ్యకమందు నున్నదని యే విజ్ఞుండు నైచ్యంబు న
న్వహముం గట్టుకొనంగఁజూచు? భువిలో నాచారముల్ ధర్మసం
గ్రహయుక్తంబులు కానినాఁ డవి దురారాధ్యంబులై సజ్జనా
గ్రహముం గూర్చి భయంబుఁ గొల్ప-మన కీ కర్మం బధర్మంబె యౌ.

ఇది మొద లెవ్వ రేని మహి నెక్కడ నైననుగాని భార్య య
న్నది తన భర్తనే విడిచి యన్యుని బొందినఁ బాతకంబు త
ప్పదు మఱి భర్తయున్ దనదు భార్యఁ బతివ్రతయైనదాని దు
ర్మదమున నీసడించుటయు మాయని మచ్చగ నెంత్రుగావుతన్. ౧౭

ఉభయుల కీ నియామక మదొక్కటి యున్ననుగాని శాంతియున్
బ్రబలదు, శాంతిమూలమున భావిపరిస్థితి భవ్యమై శుభం
బుఁ బడయనేర్చు; లోకమునఁ బుట్టిన జీవులలోన మానవుం
'డభము' శుభం బెఱుంగను బ్రయత్నము సేయుట పాడియేగదా! ౧౮

ఇది వైవాహికధర్మసూత్రముగ మీ రేర్పాటు గావించి యిం
పొదవన్ గట్టడ సేయఁగావలయు నీ యుర్విన్ మహాధర్మసం
పదగా నెల్లరు దీని నాదరముతో భావించి సంసార మ
భ్యుదయం బందఁ జరింత్రుగాత యిది శాస్త్రోక్తంబుగా నయ్యెడున్.

అని యా యందఱిముందు శాసనముగా నా శ్వేతకేతుండు చె
ప్పిన ధర్మంబును గాదుకూడదని యే విజ్ఞుండు భావింపఁ; డై
నను నుద్దాలకుఁ డద్ది విప్లవమునై న్యాయంబు లేనట్టిదా
నినిగా నెంచి కుమారు మార్చుటకు యత్నించెన్ విచిత్రంబుగా. ౨౦

కాని మఱెవ్వ రప్పటికిఁ గాదని వాదన సేయఁజాలమిన్
వాని వివాహసూత్రమె సభాజనరంజకమై పవిత్రమై
కానఁగవచ్చెఁ; గాని యది కాలమహత్త్వమొ! యేమొ! కొంద ఱా
మానిని-నాఁటిజేనిని విమర్శము చేసిరి చాటుమాటునన్. ౨౧

స్త్రీలు యథేచ్ఛగాఁ దిరిగి చిక్కినవారల ప్రక్కఁ జేరి పా
పాలకు భైరవుల్ వలె శుభంబులు దక్కి చరింపనీయ కీ
లీల వివాహబంధమును లేనిది క్రొత్తది తెచ్చిపెట్టఁగా
నేల! యటంచు దూఱుచు నదే యపచారమటంచు నెంచుచున్. ౨౨

తాతలనాఁటి ధర్మము యథాయథమై యొక క్రొత్త త్రోవలో
జాతిని మార్ప యత్నమును జల్పిన లోకము సేగి చెందదా ?
నీతి యటంచుఁ గ్రొత్తదిగ నిర్ణయ మెవ్వఁడు సేయనేర్చు ? నే
పాతకమైనఁ బ్రాఁతదియె భావ్యము మా కని గోలపెట్టుచున్. ౨౩

వైదికధర్మ మిట్టు లలుపంబుగఁ జేసిన శ్వేతకేతువున్
గాదననట్టి భూపతి సుఖంపడునే ? యని తిట్టిపోయుచున్
వాదము సేయఁజొచ్చి బలవంతముగాఁ దమపక్ష మెంతయున్
ప్రోది యొనర్పఁజూచి పలుపోకడ లొయ్యనఁ బోయి రయ్యెడన్. ౨౪

కాని యదేమొ గాని ! తమకంబున నెందఱు కుట్ర వన్నినన్
మాని యొనర్చు కట్టడయె మన్నన వొంది క్రమక్రమంబుగా
జానయి లోకమంతటఁ బ్రచారము గల్గి విశుద్ధమార్గమున్
బూని ప్రసిద్ధమై వెలసెఁ; బూర్తిగ నద్దియె నేఁటిధర్మమున్. ౨౫

## దు రా చా ర ము లు

భారతకాలమందుఁ గురుపాండవవర్గములోని చిత్రమౌ
ధోరణిఁబట్టి చూడఁ బలుత్రోవలు త్రొక్కుచు సాంఘికంబుగా
జాఱిన ధార్మికస్థితియుఁ జక్కఁగ నెల్లరి కంతునట్టు నిం
పారఁగఁ గొన్ని యెన్నద ననాదృతి సేయక యాలకింపుఁడీ! ౧

వ్యాసుఁడు గంగలో విడిచివచ్చినవారలె గాక భర్తలన్
బాసిన యంగనామణు లవారిగ ధారుణిలోన నుండి యా
సాసలు మాని తోఁచినది యంతయు ధర్మము గాఁగ నమ్మియున్
గాసిలి సంచరించిరి వికారగుణమ్ములు గల్గి యత్తఱిన్. ౨

వ్యభిచారంబన జంకు లే దెవరికిన్-వైషమ్యముల్ పెచ్చుగాఁ
బ్రబలెన్-సంకరజాతు లుప్పతిలె-దౌర్భాగ్యంబులౌ చేష్టలన్
సభలో మెచ్చెడివారె ప్రోవయిరి నిస్సారంబులౌ వృత్తులన్
శుభముల్ పాసి మెలంగి రప్పటిజనుల్ చోద్యంబుగా నెల్లెడన్. ౩

ద్యూతము సర్వజాతులకు దోసము గాని విలాసచేష్టగా
నాతఱి వృద్ధి సెందెను; మహాత్ముఁడు ధర్మజుఁ డా విరాటు-న
జ్ఞాతనివాసకాలమున గౌరవవృత్తిగ నాశ్రయించియున్
బాతకమైన జూదమును బాయఁడు; వానికి నద్ది ప్రాణమే. ౪

దానను జేసి పాండవులు దర్పము దక్కి సుఖంబుఁ బాసి శో
కాన మునింగి కానలను గాఁపురముండిరి; పిమ్మటన్ మహా
మాని సుయోధనుం డమితమత్సర మూని సమస్తకౌరవ
ప్రాణము లట్టె తీసి తనపాటికిఁ దానును జచ్చె నొంటిమై. ౫

పిలిచినవానితోఁ గలసి పీఠము వెట్టి కడంగి జూద మీ
యిల నెవఁ డాడఁడో యతఁడు హీనుఁడె యంచు వచించె ధర్మముల్
పలికెడి ధర్మరాజె; యది పామరచేష్టిత మయ్యు నాఁటి రా
జులకు స్వభావసిద్ధముగఁ జొప్పడెఁ దప్పని తోఁప దయ్యెడిన్. ౬

అన్నియుఁ బాసి లోకమున కక్కఱఁ బట్టక శాంతమూర్తులై
మన్నన బొందు 'సాధువులె' మానక జూదము లాడువారు, సం
పన్నుల మాట వేఱె నుడువందలపెట్టఁగ నేల? నాఁటి దే
శోన్నతి యిట్టు లుండె; నది యుక్తమొ! కాదొ! విచార మూవలన్.

అడవికి నేఁగఁగావలయునట్టి పరిస్థితి తెచ్చి దుర్గతిం
బడయఁగ 'నంత' చేసెనని పాప! మెఱింగియు ధర్మరాజు తా
నడవులఁ బట్టఁబోయెడి ప్రయాణమునందును బాచికల్ కడుం
గడు నుబలాట మంది తన కక్షఁ దగిల్చియు సాఁగె వెట్టియై. ౮

విరటుని పట్టణంబున విభిన్నపరిస్థితులందు తేని న
త్తెఱఁగున నాశ్రయించి తన తీరును జెప్పెడివేళ ధర్మజుం
డరమర లేక జూదమునయందలి కాంక్ష వెలార్చె దానికే
నరపతిసైత మెంతయు మనంబున మెచ్చియు నుండె నండగా. ౯

ప్రాణములతోడఁ బట్టుకొని తావలె ధర్మజు నేఁడు సాహసం
బైనను మానె యంచుఁ దను నర్మిలి వేఁడిన యా సుయోధనున్
ద్రోణుఁడు కారణంబడుగఁ దోడనె యిట్లను-ధర్మరాజు జూ
దానను గాని లొంగఁడు ముదంపడు జూదముమాట యెత్తినన్. ౧౦

కౌరవులందుఁ బెక్కు రిది గౌరవవృత్తిగ స్వీకరించి యిం
పారగ నాడుచుండి రిఁక నప్పటివారికిఁ బెద్ద సాబలుం;
డారయ నాఁటికాలమున కయ్యది లాంఛనమైన విద్యగా
నేరిచి రెందఱో; యది యనీతియొ! నీతియొ! వారికే తగున్. ౧౧

బలరాముండును జూదమన్నఁ దగఁకున్ బ్రాణంబుగాఁ జూచి పె
ద్దలలోఁ బెద్దగఁ బేరువొందె; నహి తద్ధర్మంబు కాఁబోలు! రా
జులలో రాజగు ధర్మరాజు సభలో జూదంబులో నోడినం
దులకున్ నొచ్చుకొనెన్ విశేషముగ నందున్ శ్రద్ధ చూపెట్టుచున్.

అతనికి ధర్మరాజన సహోదర మున్నది యైన-జూదమం
దతనిదె బుద్ధిలోప మయి యంతియు ఫక్కెనటంచు నమ్ము; నం
దితరుల మోస మున్నదని యెంచఁగఁ; గౌబలు హస్తలాఘవం
బతనిని ముంచెఁగాని-అది యన్యము కాదని పల్కు నొక్కఁడో. ౧౩

దానికిఁ ద్రాగుడుం గలియ ధర్మము సర్వము మాయమై యసూ
చాన దశావిశేష మగచాట్లకుఁ బాలయిపోదెఁ; జూడఁగా
దీని కథాక్రమంబు మన దేశములోఁ జిరకాలముండి యెం
తైనను వింద మిట్టదని యంద ఱెఱుంగరె యుందు రెందునున్. ౧౪

భారతకాలమం దిది ప్రభావము మిక్కిలి చూపె; మద్య మిం
పారఁగఁ ద్రావనట్టి వసుధాధిపుఁ డెవ్వఁడు లేఁడు నాఁడు. తా
గౌరవ మొంది సాంఘికముగా నొక పేరు ప్రతిష్ఠ లొందఁగాఁ
గోరినవాఁడు మద్యమును గొంకొక యింతయు లేక కైకొనున్. ౧౫

రాజయి ధర్మరాజు తనరంగ మహావిభవంబు సూపి యా
యోజను రాజసూయము మహోత్సవలీల నొనర్చునాఁడు నా
నాజన మయ్యెడన్ దమ మనంబుల కెక్కును మద్యకాంక్ష పె
చ్చెచ్చ జవసత్త్వహేతు వది యంచును దాని గ్రహించి రిమ్ముగా. ౧౬

అతఁ డొనరించు వేఱొక మహాసవనంబునఁ గల్లుఁ బెల్లుగాఁ
బితుకుచు భాండరాశులకుఁ బెట్టుచు దోసిటఁ బోసి దేవతా
తతి కడునబ్బురంపడి ముదంబున గంతులు వేయ నెల్లరున్
గతికిరి — వేయునేల సుర కన్పడె సంద్రమువోలె నత్తఱిన్. ౧౭

బలరాముం డవతారమెత్తిన మహాభాగుండె మద్యంబు ని
చ్చలు ద్రావున్‌గద! వాని జన్మకథకున్ సారస్యముం గూర్చు ప
ట్టులు కన్పట్టును గల్లుఘట్టముల నాటుంబోటులున్ లేక యిం
తలు గావించె; హలిప్రియుం డనియె నద్దానన్ జగం బంతయున్.

ఏలినవాని యానతి వహించియు సంధికి నేఁగి సంజయుం
డోలి సభాప్రదేశమున నొక్కెడఁ ద్రావియుఁ దందనాలతోఁ
గాలము పుచ్చు కృష్ణుల యుగంబును జూచెను-వారి ధర్మ మా
కాలములోన నట్టిదియె; కాదని చెప్పిన నేఁడు చెల్లునా! ౧౯

ద్వారకలో మహాపదలు వచ్చును గావునఁ గల్లు ద్రావఁగా
నేరికి వీలులే దెవనినేని వధింతును ద్రావియున్న-నా
వారని వీరు వారని ముభావము సూపఁగఁబోల దంచు నూ
రూరను జాటఁబంపెఁ బతి యుగ్రనిషేధపువార్త బిట్టుగా ౨౦

కాని యదేమి కర్మమొ - యెకాయెకి యాదవు లంద ఱొక్క గుం
పై నిజమర్త్యలాసమున కర్హముగాఁ జెలరేఁగి మద్యముం
బానము సేసి జాతర నెపంబున నంబుధితీరమందు దు
ర్మానవులై చరించి రవమానమటంచును సంశయింపకే. ౨౧

అచ్చట ముఖ్యుఁడై పరఁగు నా బలరాముఁడు కృష్ణుమ్రోలనే
యొచ్చెమటంచు నెంచక మహోత్సవలీలగఁ గల్లు ద్రావి తాఁ
బిచ్చిగ సంచరించి యవివేకము సూపుచు తేని యానతిన్
బచ్చముపాడు చేసెఁ గృతవర్మయు సాత్యకి తోడు సల్పఁగా. ౨౨

ఇఁక వ్యభిచారవృత్తి మహి నెంతగఁ బ్రాఁకెనొ దాని గూర్చి వే
ఱొక కథ మాత్ర మిచ్చుట నయుక్తమె యైనను దప్పదంచుఁ గొం
కక వివరింతు - నిద్ది కలికాల మహత్త్వమటంచు నేర్చు బు
ద్ధికి నది బుద్ధి నేర్పఁగల తెన్నని యెన్నిక సేయఁగావలెన్. ౨౩

# దీర్ఘతముఁడు

కలఁ డొకచో నుతథ్యుఁడను జ్ఞాని తపంబునఁ బేరుమోయు పె
ద్దల తలమానికంబయి ముదంబునఁ గాఁపురముండెఁ గానలో
పలఁ దన ధర్మపత్ని తనపాలిట భాగ్యపురాశి కాఁగ ని
మ్ములఁ దగు శిష్యవర్గము ప్రమోదముతోఁ బరిచర్య సేయఁగా. ౧

ఆ మునివర్యు పత్నియు మహామహురాలయి తన్మనఃప్రమునిన్
స్వామిగఁ జూచుకొంచు నొక వంకయు లేక మెలంగు; నింతలో
నామెకు గర్భ మేర్పడఁగ హర్షము నొందియు నిద్ద రెంతయున్
బ్రేమ దలిర్ప నొండొరులు కేయుఁబస క్లైడఁబాయ రే యెడన్. ౨

అట్టితఱిన్ బృహస్పతి ప్రయాణములో నటువచ్చి వారు చూ
పెట్టిన యాదరాదికము పేర్మిని గైకొని సంతసించి యా
పట్టునఁ గొన్ని నాళ్లు శుభంబుగ నచ్చట నుండి యొక్కనాఁ
డట్టె యుతథ్యుభార్యను బ్రియంపడి కోరెను సంగమింపఁగా. ౩

ఆయది ధర్మమా యనుచు నప్పుడు పల్కుట తప్పు; దేవర
న్యాయము నాదుకోరికకు నర్హ మటంచును సాకు చెప్పి యా
వాయపురజ్ఞులాఁ డెవరివల్ల నిషేధము లేక మోటుగా
నాయమఁ బట్టి యా పనికి నయ్యెడఁ బూనఁగ నంతలోపలన్. ౪

కడుపున నున్న బిడ్డ కది కాపురుషోచితకృత్యమై కడుం
గడు నిరసించి ధర్మ మది గాదని వాఁడటు కూయి పెట్టఁగా
గడుసరియా బృహస్పతి యెగాదిగ నావెను గాంచి లోని యా
బుడుతనితో వచించె నిజబుద్ధిపటుత్వ మెఱుంగఁ జేయుచున్. ౫

ఓయీ, నీ వొక బాలిశుండవయి నా యుత్సాహమున్ భగ్నమున్
జేయంగా దొరఁకొంటివో! యెటులొ నీ చిత్తంబులోఁ గల్మషం
బీ యోజన్ బెనుపొందఁజేసె నహహా! యీ బుద్ధి నీ కెవ్వ రీ
ప్రాయంబందునె నూఱిపోసి రకటా! పాపిష్ఠజన్ముండవే!! ౬

నీ వొక శాస్త్రవేత్తవని నీతి నెలాద్భుతలంపుతో నహం
భావము కన్న నిప్పు డమునంటి మనీషులమ్రోలఁ బోకడల్
పోవఁగఁజెల్లునా? యని యపూర్వనటించు వచింతు నెవ్వరీ
త్రోవలు నీకుఁ జూపి రసిరో! యిది నీకు వినాశకాలమే. ౭

భువిని సమస్తభూతముల బుద్ధికి నచ్చెడు ధర్మమార్గమే
యవ్వనని పల్క నేల? హృదయంబునఁ దోఁచినదానిఁ దీర్పుగా
నెవనికి నేర్పఁజూచెద వికీ! నిను నైపఁగఁజాల నిత్తఱిన్
శివశివ! నా ప్రయత్న మిటు చిందఱవందఱ సేయఁజూతువా! ౮

ఎఱిఁగియు నిల్లు త్రొక్కకొని యిట్టులు వచ్చిన నన్నుఁగూర్చి తొం
దరపడి బుద్ధి సెప్పను వృథా నిరసింపను సిద్ధమైన నీ
యఱగొఱజ్ఞానమూ విశదమయ్యెను-నీ విఁకఁ బుట్టుగ్రుడ్డివై
చెఱలు పడంగఁ బుట్టెదవు ఛీ! యని తిట్టుచు శాప మిచ్చినన్. ౯

కాలమహాత్మ్య మేమొ! పలుగాకిగఁ బల్కిన వాని మాటయే
శూలమునై యభాగ్యుఁ డటుచూడను గన్నులు లేక పుట్టి వే
దాలు సమస్త శాస్త్రములు తక్కిన విద్యలు చక్క నేర్చి యు
ద్వేలవివేకయుక్తుఁడయి వేయి విధాల వెలింగె నిద్ధరన్. ౧౦

అరయఁగ వాఁడు దీర్ఘతముఁ డంచును బేరును బొందెఁగాని దు
ష్కరమగు యోగసాధనము కల్మిని దద్దయుఁ గీర్తిఁ గాంచె డె
ప్పరమగు వాని జ్ఞాన మనుభావ మెఱింగియు సాటివార లా
దరమును జూప నెంతయు ముదంబునఁ గాలము వుచ్చు నిమ్మహిన్.

అతనికి భార్యగా నొకతె యయ్యెను గాని ప్రవర్తనంబులో
నతుకదు వాని కావిడ; యథార్థముగా నతఁ డొక్క జ్ఞానియై
బ్రతుకుటఁ జేసి భార్యను లవంబుకు దూఱక కాలయాపనం
బు తగినతీరు సేయుచు నపూర్వతితిక్ష వహించె మానియై. ౧౨

ఇట్టులు కాలమున్ గడపు నిస్సురసేన్ బహుపుత్త్రిలాభమున్
బెట్టనికోటయై పరఁగెఁ; బ్రేముడి నెల్లను జాఱిపోయి యే
కట్టడ లేక యాపె నటకారము నిరసించి వల్లభున్
దిట్టఁగసాగె నంతయు మదిం గుఱుతించియు నాతఁ డిట్లనున్. ౧౩

ఓసీ, నన్నిటు లేల దూఱెదవు? నీయుద్దేశ్య మేమున్నదో!
గాసింబెట్టఁగఁ గారణం బెదియొ? నీ కౌటిల్య మీ రీతి నా
వాసిన్ వంశము వాసి రూపు చెఱుపన్ బ్రారబ్ధ మిట్లాయె-నీ
దోసంబున్ క్షమియింపఁజాల నిజ మేదో చెప్పుమా యాచెదన్. ౧౪

నా విని యాపె బిట్టడరి న్యాయము ధర్మము ద్రోసి తానహం
భావముతో వచించె విను-భర్త భరించెడువాఁడు కాఁడె? నీ
త్రోవ విరుద్ధమై యధికదుఃఖము కూర్చెడు; నీకు నాకు నిం
కే విధమైన పొత్తు జనియింపదు చాలును బొమ్ము దవ్వులన్. ౧౫

అని నిరసింపఁ గ్రుద్ధుఁడయి యా ముని భామినితోడఁ బల్కె-మా
నినులకు శాప మిత్తు విను-నేఁడు మొదల్ పతిహీనలైన కా
మిను లెవరేనిఁగాని మితిమీఱిన సంపద యున్న సత్కులం
బున జనియించియున్నను బ్రభూతతిరస్కృతి నంది కుందరే! ౧౬

వారిని గారవింపఁగలవారును గానఁగరారు భూమిలో
వారికి నెట్టి యాభరణభాగ్యములుం జన నెట్టి సౌఖ్యముల్
వారికి నుండనేర విఁక వారికి మంగళవేషమన్న దె
వ్వారును సమ్మతింప రిది భావిపరిస్థితి యెల్లవారికిన్. ౧౭

అని శపియింప నా చెడిప యట్టె భయంకరవృత్తి దాల్చి వా
నిని గొనిపోయి యొందయిన నెమ్మదిగా విడిపించి రండు మీ
రని తన పుత్త్రిలన్ బిలిచి యప్పుడె పంచిన వారు మూర్ఖులై
కనికర మేమి లేకయె యొకాయొకిఁ దండ్రిని ద్రాళ్ళఁ గట్టియున్. ౧౮

బిరబిర యేఁగి వృద్ధుని వివేకిని జేకను గంగలోన న
బ్బురముగఁ జాఁజద్రొబ్బి రిఁకఁ బుత్త్రిలటన్నను వారె పుత్త్రిలై
పరఁగెదరేమొ! పిమ్మట నభాగ్యుఁడు నీటను గొట్టుకొంచు నా
తరఁగలఁ గ్రిందుమీఁదయి నిదానముగా నొక రేవు పట్టినన్. ౧౯

అచ్చట ఱేఁ డొకండు తన యంగనలం గమి సేర్చి వారితో
ముచ్చటగా జలంబులను మున్కలు వెట్టుచు నోలలాడుచున్
బచ్చివిలాసముల్ జరుపుపట్టున నేటను నీటివాలుగా
వచ్చెడువానిఁ గాంచి యటువైపున భృత్యులఁ బంపెఁ బట్టఁగా. ౨౦

అది యొక దొడ్డచేఁప యగునంచు మనంబున నెంచి సంబరం
బెదఁ జిగురొత్త భృత్యు లటు లేఁగియుఁ జూచిరి వాని-వేదమున్
జదివెడువానిఁ బ్రాయమునఁ జాలఁగ దాఁటినవాని గ్రుడ్డియై
పదిలము దక్కి రజ్జువుల బంధితుఁడై కడు స్రుక్కు పాఱునిన్. ౨౧

వానిని దెచ్చి తీరమున వైచిన ఱేఁడును వచ్చి బిట్టుగా
వానిని జీరి దేహమున బంధన మెల్లను జాఱఁద్రోసి య
మ్మానవు వేదవేత్తయగు వానిగ బుద్ధి నెఱింగి తోడనే
వానికి వందనం బిడి సభార్యుఁడునై వచియించె నిట్టులన్. ౨౨

స్వామీ, యెచ్చటనుండి రాక? తమ రే ప్రాంతంబు పోఁజూతురో?
మీ మాటల్ వినిపింపరారె! భువిలో మీవంటి ధన్యాత్ము-లు
ద్దామప్రాభవ మీయరే! మఱియు మా దౌర్భాగ్యమున్ జక్కఁగాఁ
దామున్ జిత్తములో నెఱింగి తగు సంధానంబు గావింపరే! ౨౩

నా విని వాఁడు ఱేనికి మనంబున నున్న యభీష్ట మేదియో
తా వినఁగోరి ప్రశ్నము ముదంబున వేయఁగ సంతసించి స
ద్భావము సూపు వానికిఁ బదంపడి మ్రొక్కిడి పుట్టుపూర్వముల్
భావిపరిస్థితుల్ గుఱిచి పల్కెను నమ్రత మీఱ నిట్టులన్. ౨౪

తడవులఁబట్టి రాజ్యమునఁ దక్కిన భోగము లెన్నొ యున్నఁగాఁ
గడిచితిమయ్య, సంతతిని గోరి వ్రతంబులు దీక్షమైఁ గడుం
గడు భయభక్తులన్ సలుపఁగాఁ నాచరించితిమయ్య, బిడ్డ యొ
క్కఁడు గలుగండు; కర్మ మిటు లాయెను స్వామి, యనుగ్రహింపవే!!

అన విని మౌని దానికి మహామనుఁడు పొందియు వల్లెయంచుఁ దో
డనె పురి కేఁగి స్వర్గ మది దక్కినరీతిగ నెంచె; రేఁడు వా
నిని దన మేడలో నపుడె నెమ్మదిగా నొకచోటఁ జేర్చి మ
న్ననలు పొనర్చి సంబరమునన్ బరిచర్యలు చేసె నెన్నగా ౨౭

సంతతి గోరి రాజొక నిశాసమయంబున రాణిఁ బిల్చి యా
వంతున వానిఁ బొందుమని పల్కిన వల్లె యటంచుఁ బైకి నా
కాంత వచించి పాపుని మొగంబును గ్రుడ్డితనంబు వైగన
త్యంతము పూతిగంధము భయంపడి కాంచియు రోసి యత్తఱిన్.

దాసి నొకర్తు నేర్పఱిచి దానికి వన్నెలు దిద్ది మేలుగా
వేసము వైచి పంపెనది విజ్ఞుఁడు వృద్ధుఁ డెఱింగి యాపెతో
దోసమటంచు నెంచక రతుల్ కొనసాగఁగ సంచరించె నా
దాసికి నప్పుడే పదికి దాఁటిన సంతతి పుట్టె నట్టనన్. ౨౮

వారలఁ జూచి రేఁడు నిజవంశము నేఁడు తరించె నింక నే
కోరిక లేదు మౌని యిటు కూర్చిన మేలున కేది యిత్తునం
చూరక యాత్మలో మురిసియున్ మునిఁ జేరి నమస్కరించి యిం
పారఁగఁ బల్కెఁ బ్రేమమయమైన తదీయచరిత్ర గూర్చియున్. ౨౯

అది కిటు విన్నవించెఁ దన దుఃఖము తీఱఁగ స్వామి, వీరు నా
బ్రదుకును జూచు బిడ్డలయి వంశము నిల్పెడువారలే కదా ?
యిది యెఱిఁగింపుఁడన్న నతఁ డేఁడియు దాఁపక యూఁచముట్టుగాఁ
గథ వినిపించె దాసికిని గల్గిన సంతతి యంచు నత్తఱిన్. 30

దానికి నెవ్వగం బొగిలి తత్క్షణమే తన రాణిఁ బిల్చి య
మ్మానవనాథుఁ డయ్యది ప్రమాదమటంచును బోధ చేసి య
మ్మానిని సమ్మతించెడి సముచితపద్ధతి నేర్చి యావలన్
మానిని వెండియున్ వినయమార్గములో బతిమాలె-నాతఁడున్. ౩౧

సరి యంచున్ దన సమ్మతంబు తెలుపన్ సంతోష ముప్పొంగ నా
ధరణీశుం డొక రేయి రాణి కటు తత్సంధానముం గూర్చెఁ జె
చ్చెర జాత్యంధుఁడు దాని జీవితములో శ్రేయంబె కాంక్షించి యా
దరమున్ జూపుచు నంటె దాని యొడ లంతన్ జిద్విలాసంబుగా. ౩౨

ఇఁకఁ దరువాయి బిడ్డ జనియించుటయే గద! రాజు కోరిన
ట్లు కొడుకు పుట్టె; వాఁడు సురలోకమునందును జేసు మోసి యె
న్నిక కలవాఁడె యయ్యెనఁట; నెమ్మదిగా నతఁడే సమస్తధా
త్రికిఁ బరిపాలకుండయి విరించిని సైతము మించెఁ దేజులో. ౩౩

ఈ కథలో రహస్యము పరీక్షగఁ జూచిన నేహ్యమై యసం
ఖ్యాకవిరుద్ధధర్మముల కాస్పదమై కనిపించుఁ; గానిచో
లేకిగఁ జూచి భార్య వెడలించిన దిక్కుచె పోయి పోయి సు
శ్లోకుఁడునై పరాంగనకుఁ జుట్టము నౌట విచిత్రమే గదా! ౩౪

ఇది
శ్రీ శేషాద్రిశేఖర విభుప్రసాద సమాసాదిత
మహిత కవితాధురీణ
ఆంధ్రవిశ్వకళా పరిషదర్పిత విద్వద్బిరుద
విరాజిత పాండితీ ప్రవీణ
వైదికవాఙ్మయ చరిత్రాద్యనేక గ్రంథనిర్మాణ పారీణ
శ్రీ రాజరత్నాంబా-బుచ్చయ్య ప్రథమపుత్త్ర
సత్యనారాయణ చౌదరి
రచించిన
కలిపురాణ మను కావ్యమునందు
రెండవ భాగము
సర్వము సమాప్తము

శుభమ్

ఇది నవభారతంబు - మన యిప్పటి సాంఘికధర్మసూత్రసం
పదలకు ముందువానికి నపారవిభేదము గానవచ్చు; న
య్యది గుఱుతించి లెస్సగ సమన్వయబుద్ధిని జూచు టొక్కఁడే
కద మన కెంతయుం దగిన కర్జము! దానికె యీ ప్రయత్నమున్.

## ఏతద్గ్రంథకర్తృ - రచనలు

| | | |
|---|---|---|
| 1. | వైదిక వాఙ్మయచరిత్రము | 3- 0-0 |
| 2. | సతీ సప్తతి | 0- 2-0 |
| 3. | కథావింశతి | 0- 8-0 |
| 4. | చంద్రాపీడచరిత్ర | 0- 8-0 |
| 5. | కామశాస్త్రము | 2- 0-0 |
| 6. | కావ్యమాల 1 భాగము | 1- 4-0 |
| 7. | కావ్యమాల 2 భాగము | 1- 4-0 |
| 8. | సుభాషితము | 0- 4-0 |
| 9. | ధర్మశాస్త్రము | 2- 8-0 |
| 10. | కవులకథలు | 0- 8-0 |
| 11. | వరరుచి | 0- 8-0 |
| 12. | ఈశ్వర సేవకులు | 1- 0-0 |
| 13. | విక్రమ కథలు | 0- 8-0 |
| 14. | మ్రొక్కుబడి [పద్య. కా.] | 0- 8-0 |
| 15. | నవనాథము | 1- 8-0 |
| 16. | బృహత్కథలు | 0- 8-0 |
| 17. | వత్సరాజు | 1- 4-0 |
| 18. | విక్రమాదిత్యము | 0-12-0 |
| 19. | సాలభంజికలు | 0-11-0 |
| 20. | బాపూజి [పద్య. కా.] | 0- 8-0 |
| 21. | చారుదత్తము | 1- 4-0 |
| 22. | నీతిచంద్రిక [కరదీపికా వ్యాఖ్యాసహితము] | 3- 0-0 |
| 23. | చిన్నయ్య [సూరిజీవిత చరిత్ర] | 0- 6-0 |
| 24. | నైషధము | 1- 0-0 |
| 25. | కలిపురాణము [పద్య. కా.] 1 భాగము | 2- 0-0 |
| 26. | ప్రతాప సింహము | 1- 2-0 |
| 27. | వీరపూజ | 1- 2-0 |
| 28. | చాణక్యము | 1- 2-0 |
| 29. | దివ్యమూర్తులు | 1- 2-0 |
| 30. | స్వరాజ్య కథలు | 1- 2-0 |
| 31. | మాయాభిక్షువు [ప. కా.] | 1- 4-0 |
| 32 | కలిపురాణము [ప. కా.] 2 భాగము | 2- 0-0 |
| 33. | కులపతి [వరదాచార్య జీవితము] | 1- 2-0 |
| 34. | మహారథులు | 1- 2-0 |
| 35. | మేవాడ విజయము | 2- 0-0 |
| 36. | సైరంధ్రి | 2- 0-0 |
| 37. | కలిపురాణము [ప. కా. 3 భాగము] | 2- 0-0 |
| 38. | కలిపురాణము 4 భా. | 2- 0-0 |
| 39. | కలిపురాణము 5 ,, | 2- 0-0 |
| 40. | లోకతంత్రము [ప. కా.] | 1- 4-0 |
| 41. | శిశుఘ్న ,, | 0- 4-0 |
| 42. | పండితుఁడు ,, | 0- 2-0 |
| 43. | తెలుఁగు వెలుఁగులు | 0- 8-0 |
| 44. | చిత్రకథలు | 0- 8-0 |
| 45. | వినోదకథలు | 0- 8-0 |
| 46. | శకున్తలా [సంస్కృతము] | 0- 8-0 |
| 47. | సాహితీ సమీక్ష | 1- 2-0 |
| 48. | నా యుపాధ్యాయ-గిరి | 1- 2-0 |
| 49. | త్యాగయ్య | 1- 2-0 |

భాషాపోషక గ్రంథమండలి-అమృతలూరు-గుంటూరుజిల్లా